# శ్రుతి సౌరభం

## ప్రథమ భాగం

శ్రీ శృంగేరి జగద్గురు మహాసంస్థాన పురాణ విద్వాంసులు
'విద్యాలంకార', 'భాషాప్రవీణ'
**డాక్టర్ చిఱ్ఱావూరి శివరామకృష్ణశర్మ**
M.A.(Tel), M.A. (Sanskrit), Ph.D.
రీడర్
ఆంధ్రజాతీయ కళాశాల, మచిలీపట్నం

పద్మనాభ గ్రంథమాల
మచిలీపట్నం

ప్రథమ ముద్రణ : విక్రమ 2000,

ప్రతులు : 1000

This book is published with Financial
Assistance of Tirumala Tirupati
Devasthanams under their scheme
' Aid to Publish Religious Books '

ముఖచిత్రం :

మొహంజొదారోలో లభించిన పశుపతి దేవుని
ముద్రికకు ఛాయాచిత్రము



ప్రతులకు :

Ch. కృష్ణవేణి
C/o. Dr. Ch. శివరామకృష్ణశర్మ
8/221, గొడుగుపేట
మచిలీపట్నం - 521 001

ముద్రణ :

[illegible] షిరిడి ప్రింటర్స్
మచిలీపట్నం

ఈ వేద పరిశోధనకు ప్రేరణ, శక్తి, మార్గము ప్రసాదించినవారు

**సద్గురు సాయినాథులు**

ఈ గ్రంథము వెలుగుచూచే భాగ్యాన్ని అనుగ్రహించినవారు

**శ్రీ వేంకటేశ్వరస్వామివారు**

వారి కృపాఫలాన్ని మరెవరికో సమర్పణ చేయడానికి నేనెవడను?

**త్వదీయ మేవ గోవింద**

**తుభ్య మేవ సమర్పయే**

**- రచయిత**

# ఎందరో మహానుభావులు...

ఈ శ్రుతి సౌరభం నలుదిక్కులా వ్యాపించడానికి ఆర్థిక సహకారం ప్రసాదించిన తిరుమల తిరుపతి దేవస్థానం వారికి,

నా రచనలు వెలుగులోకి రావడానికి అనుక్షణం ప్రోత్సహిస్తున్న మిత్రులు నైష్ఠికులు బ్రహ్మశ్రీ అరిపిరాల సీతారామయ్యగారికి,

ఈ గ్రంథాన్ని చూచి తమ అమూల్యమైన అభిప్రాయాన్ని ఇచ్చిన మహామహోపాధ్యాయ రాష్ట్రపతి పురస్కారగ్రహీత, సాఙ్గస్వాధ్యాయ భాస్కర, వేదభాష్యరత్నాకర, మీమాంసావిద్యాప్రవీణ, శాస్త్రనిధి, స్మార్తాచార్య బ్రహ్మశ్రీ సన్నిధానం లక్ష్మీనారాయణ మూర్త్యవధానులుగారికి,

ఈ వ్యాసాలను చదివి, అవి ఆంగ్లభాషలోనికి పరివర్తితం కావాలని రెండువేల రూపాయల విరాళంతో ముఖ్యకాశాసనం చేసిన ద్వాదశ భాషాపండితులు, సుకవి, త్రిపురసుందరీ ప్రతిష్ఠాన వ్యవస్థాపకులు, అమెరికాలోని హిందూ సంఘ సాంస్కృతిక కేంద్ర పరిపాలనాధికారి ఆచార్య కోట సుందరరామశర్మగారికి, భారతీయ సంస్కృతి ప్రీతితో అస్పష్టంగా ఉన్న మహాదేవ ముద్రికను, హయగ్రీవ ముద్రికను చిత్రాలుగా గీయించి, శ్రుతి సౌరభం 3వ భాగం ముద్రణకు ఆర్థిక సహకారం చేసిన గోపి గోల్డ్ ప్లేటింగ్ వర్క్స్ అధినేత వదాన్యులు శ్రీ మహంకాళి సత్యనారాయణగారికి,

నా పరిశోధన వ్యాసంగాన్ని ప్రోత్సహిస్తూ నా కృషిని అభినందిస్తున్న ఆంధ్ర జాతీయ కళాశాల పాలకవర్గం ఆంధ్రజాతీయ విద్యాపరిషత్తు, మచిలీపట్టణం వారికి, వాళ్ల సంవత్సరాలుగా మా కుటుంబారోగ్యాన్ని కాపాడుతూ, వేదభాష్యశ్రవణం చేయడం ద్వారా నా పరిశోధన వ్యాసంగానికి పరోక్షంగా తోడ్పడిన డాక్టర్ జోస్యుల కాళిదాసుగారికి, దీనిలోని చారిత్రక

వ్యాసాలను ఆంగ్లంలోకి పరివర్తనం చేసి తమ విశిష్టాభిప్రాయాన్నిచ్చి ప్రోత్సహించిన ప్రముఖ చరిత్ర విద్వాంసులు, శ్రీ పద్మావతీ మహిళా హిందూకళాశాల ప్రాచార్యులుగా పనిచేసి విశ్రాంతినందిన శ్రీ సర్వా రామమోహనప్రసాద్, M.A., Phil. గారికి,

భారతీయ సంస్కృతిపై అభిమానంతో, హరప్పా సంస్కృతిలో వేదసంస్కృతి అనే వ్యాసాన్ని విడిగా ప్రచురించి పలువురు ప్రముఖులకు పంచిపెట్టిన దేవీపూజాధురంధరులు, వదాన్యులు బ్రహ్మశ్రీ కోట సీతారామశాస్త్రిగారికి,

ఈ వ్యాసాన్ని తమ పత్రికలో ప్రచురించిన శ్రీవాణి పత్రికా సంపాదకులు శ్రీ కామరగిరి కృష్ణమోహనరావుగారికి, ఆంధ్రప్రభ సాంస్కృతిక విలేఖరి శ్రీ ముదిగొండ శాస్త్రిగారికి,

ఈ గ్రంథం భారతదేశ ప్రముఖులకు చేరడానికి ఆర్థిక సహాయమిచ్చిన చిట్టిగూడూరు నారసింహ సంస్కృత కళాశాల ప్రిన్సిపాల్ శ్రీ భారతం శ్రీమన్నారాయణగారికి (రిటైర్డ్) హృదయపూర్వక ధన్యవాదాలు.

భారతీయ సంస్కృతిమీద అభిమానంతో ఈ గ్రంథం వెలుగులోకి రావడానికి మార్గాలు వెదకి, దీనిని సుందరంగా తీర్చిదిద్దుతున్న శ్రీ తేజశ్రీ షిరిడీ ప్రింటర్స్ అధినేత శ్రీ సి.హెచ్. సాయిబాబా గారికి, పశుపతి దేవుని ముద్రికకు, హయగ్రీవ ముద్రికకు అందమైన ముఖచిత్రాల నందించిన కళాకారుడు శ్రీ టి. భాస్కర్‌గారికి నా కృతజ్ఞతలు.

అస్తవ్యస్తంగా ఉండే నా రాతను సహనంతో స్పష్టంగా, సుందరంగా సాపు ప్రతిని సమకూర్చి సహకరిస్తున్న నా అర్ధాంగి చి. సౌ. కృష్ణవేణికి శుభాశీస్సులు.

- రచయిత

# విషయ సూచిక

మరికొందరు- B.C. 4500 సం॥ అనియు, ఇంకా కొందరు - B.C.20,000 సం॥ అనియు చెప్పుట జరిగినది. ఇప్పుడది 'హరప్పా' కాలమును దాటినదని నిశ్చయమగుచున్నది. ఇట్లు పోయి పోయి, యీ వేదకాలము- వేదముల అనాదిత్వములో పర్యవసితమైనను ఆశ్చర్యపడవలసిన యవసరములేదు.

శ్రీ శర్మగారి గ్రంథములో- వేదకాలనిర్ణయము ప్రాముఖ్యమును వహించినను, వేద సంబద్ధములగు అపూర్వవిషయములను పెక్కింటిని గూడ వారు వివిధప్రకరణములలో వివరించినారు. వేదములో- ఆధునిక విజ్ఞానము, భూగోళవిశేషములు, జ్యోతిషము, ఓషధులు-వినియోగములు, వ్యవసాయము, శృంగారము, ఇతిహాస పురాణములలో వేదోపబృంహణము, స్వరసమన్వయము - ఇత్యాదులు.

ఈ గ్రంథములోని కొన్ని ప్రకరణములు శ్రీ శర్మగారు చదువగా విని యానందించు భాగ్యము నాకు కలిగినది. భారతీయ విద్యాస్థానములలో వారికి గల నైపుణ్యము, ప్రమాణోపపత్తి పురస్సరమైన విషయోపస్థాపనము, సాహిత్యశైలియు విషయవిమర్శనము ప్రశంసాపాత్రములై ఒప్పారుచున్నవి.

ఈ గ్రంథమును ముద్రించి, వేదవిజ్ఞాన వైశిష్ట్య జిజ్ఞాసువులందరికిని అందజేయవలెనని శర్మగారు సంకల్పించినారు. ఇది బహుధన వ్యయసాధ్యమైన కార్యము. వేదవిజ్ఞాన-ధర్మాభిమానులైన సంపన్నగృహస్థులును, ధర్మప్రచారసంస్థలును సహకరించి, వారి సంకల్పము సఫలమగునట్లు అనుగ్రహింప మని వేదభగవానుని ప్రార్థించుచున్నాను.

ఇట్లు

17-3-2000 వి. లక్ష్మీనారాయణమూర్తి

## ఆచార్య కోట సుందరరామశర్మగారు

హిందూ సంఘ సాంస్కృతిక కేంద్ర పరిపాలనాధికారి, శాన్‌ఫ్రాన్సిస్కో
ద్వాదశభాషా పండితుడు, సుకవి,
త్రిపురసుందరీ ప్రతిష్ఠానం వ్యవస్థాపకుడు, మచిలీపట్టణం

డాక్టర్ చిర్రావూరి శివరామకృష్ణశర్మగారు నాకు చిరకాల పరిచితులు. ఆయన శంకరమఠంలో నా అధ్యక్షంలో వేదోపన్యాసాలపై చేసిన ప్రసంగం నాకు చాలా ఆనందం కలిగించింది. శర్మగారు కొన్ని సంవత్సరాలు వేదంపై చేసిన పరిశోధనల ఫలితమే 'శ్రుతి సౌరభం'.

ఈ వ్యాస సంపుటిలో వేదంలో విజ్ఞాన విషయాలు, జ్యోతిషం, ఎక్కాలు, వైద్యం మొదలయిన అనేక విశేషాలున్నాయని నిరూపించారు. 'అనాగరకులయిన ప్రాచీన మానవులు ప్రకృతి శక్తులను చూచి భయపడి చేసిన స్తోత్రాలే వేదాలు' అని చరిత్ర గ్రంథాల్లో చేసే వేద పరిచయం అసత్యమని తెలుస్తోంది.

వేదంలో 12 ఎద్దులతో, 6 కాడులతో దున్నే నాగళ్లతో సేద్యం ఉందని వీరు వివరించడం వల్ల 'ఆర్యులు దేశదిమ్మరులు, వారికి సేద్యం తెలియదు' అనే విమర్శలు నిరాధారాలని తెలుస్తుంది.

హరప్పా నాగరికతలో వైదిక సంస్కృతి అనే వ్యాసం హరప్పా మొహంజోదారో త్రవ్వకాలలో దొరికిన అవశేషాల ద్వారా ఆనాటికే రుద్రారాధన, హయగ్రీవారాధన, వైదిక సంస్కృతి, ప్రణవం ఉన్నట్లు వెల్లడిస్తుంది. కనుక, క్రీ.పూ. 1500 ప్రాంతంలో ఆర్యులు భారతదేశానికి వచ్చారు. వేదాలకాలంలో బయలుదేరిన' అనే వాదాలు సత్యదూరాలని స్పష్టమవుతుంది. ప్రణవం నుండి బ్రాహ్మిలిపి బయలుదేరిందనే నిరూపణం వల్ల 'భారతీయులు విదేశీయుల నుండి లిపిని తీసుకున్నారు' అనే ఊహాలు కల్పితాలని తెలుస్తోంది. గాంగ్య అనే ఋగ్వేద పదం 'గంగ' సంస్కృత పదమే అని సాక్ష్యం చెబుతోంది.

ఇంకా అనేక వేద విశేషాలతో నిండిన యీ శ్రుతి సౌరభం ఆంగ్లభాషలోకి గూడ పరివర్తితమయి ప్రపంచ మంతటా వ్యాపించాలి. ఇది వేదంపై ఉన్న దురభిప్రాయాలను తొలగించాలని నా మంగళా శాసనం.

- ప్రొఫెసర్ కోట సుందరరామశర్మ

**S. Rama Mohan Prasad,** M.A., M.Phil.
Principal (Retd.)
Sree Padmavati Mahila Hindu Kalasala
Machilipatnam

1-5-1999

I have gone through the article "హారప్పా సంస్కృతిలో వేద సంస్కృతి" by Dr. Ch. Siva Rama Krishna Sarma. My knowledge of Indian History has come from the study of the books written by English author like Dr.V.A. Smith, or early Indian authors like Majumdar. The books of English authors are based upon their interpretation of our country's history written in a manner to suit their purposes. They were written with the object of glorifying and perpetuating their own rule and negating all that is great or noble in the country's history. There may be a number of exceptions but most English or Western authors followed the traditional pattern - that Indian civilization is of recent origin, that the Aryans came here from outside, that they had destroyed the earlier rule and civilization of the Dravidians and so on and so forth. They had written that the civilization discovered at Mohenjodaro and Harappa, two villages on the banks of the Indus river, was a Dravidian civilization and the migrating Aryans had distroyed it and imposed their own civilization.

Dr. Siva Rama Krishna Sarma's article has opened an entirely new line of thought. A scholar of no mean order, he has used his vast knowledge of Sanskrit literature to make a deep study of the figures and articles unearthed at the two places, and identify them with the description of the various rituals and sacrifices mentioned in the vedic texts. In the process he has dispelled many of the fallacies of the to called Aryan-Dravidian conflict.

Dr. Sarma's description of the worship of Siva-Pasupati, as found in one of the figures at Mohenjodaro, is a case in point. He has made a through examination of the figure bit by bit and pointed out how it relates to the worship of Rudra as mentioned in our Sruti as well as Smriti literature. The various 'names' of the Lord as narrated in the శివసహస్రనామ స్తోత్రము have been literally brought to like in Dr. Sarma's description of the figure, especially nama "[illegible]".

Dr. Sarma proceeded to make out strong case for the existence of "Yagna" during the period. The worship of the mothergoddess is effectively pointedout with the very large number of references made to the Deity in our texts. The mention of "Hayagriva" has served too important purposes. A case was made out for the existence of the worship of Lord Vishnu at that time, as also use of the horse, which it has been thought Literto, that the Indus people did not know. The existence of ironwave has also been effectively pointed out. The foodgrains and the articles of daily use as unearthed in the two places, have been identified with the same as referred to in our texts.

Dr. Sarma in his article, has brought out the following facts.

1) Indian civilization is a continuous process
2) The so called Aryan-Dravidian conflict is a fallacy, and
3) The Mohenjodaro - Harappa culture is the same as the Vedic culture.

He is quite correct in writing that a further reference to Sanskrit literature will be yielding more details about the civilization of Mohenjodaro and Harappa.

- S. Rama Mohan Prasad

# ప్రవృత్తి నిమిత్తం ...

భారతదేశ చరిత్ర తొలి పుటలో 'తొంభైఅయిదు శాతం హిందువులు అయిదు శాతం విదేశీయుల చేతిలో పరాజితులయి వారిచేత పాలింపబడినారనేది ప్రపంచంలోనే ఒక వింత' అనే వాక్యం కనబడుతుంది. నిజమే. అనైకమత్యం, ఉపేక్షాభావం వంటి అవలక్షణాలున్నచోట ఎన్ని వింతలయినా సంభవించవచ్చు.

భారతదేశంలో, ఆంధ్రప్రదేశంలో ఊరూరా వేదసభలు జరుగుతుంటాయి. వేదపండిత సన్మానాలు చేయడం సామాన్యుని స్థాయి నుండి రాష్ట్రపతి స్థాయి వరకు ఉంది.

కాని వైదిక సాహిత్య చరిత్ర, భారతదేశ చరిత్రలకు చెందిన గ్రంథాలలో వేదాన్ని గురించి చాలా హీనభావాలు కనబడతాయి. పాఠశాల స్థాయి నుండి విశ్వవిద్యాలయాల్లో పరిశోధన స్థాయి వరకు ఆ భావాలనే హిందూ విద్యార్థుల చేత అధ్యయనం చేయిస్తున్నారు. ప్రపంచంలో ఏ దేశంలో ఏ మతానికీ ఇటువంటి దుస్థితి పట్టి ఉండదు.

ఒక విషయం సత్యమయినపుడు మనకు ఇష్టమయినా కష్టమయినా అంగీకరించక తప్పదు. కాని ఒక సత్యం కాని విషయాన్ని సత్యంగా భావించి, దానిని విద్యార్థులచే అధ్యయనం చేయిస్తూ వారిలో న్యూనతా భావాన్ని పెంపొందింప చేయడం మన చరిత్ర గ్రంథాలు చేస్తున్న ఘన కార్యం.

ఇంతకీ చరిత్ర గ్రంథాలలో వేదాలను గురించి కనబడే హీనభావాలేవి? అని ప్రశ్న.

అద్భుత ప్రకృతి శక్తులను చూచి భయపడి చేసిన ప్రార్థనలే వేదాలని ఒక భావం. పురోహితులు వాళ్ళ వృత్తికోసం పెంచిన నిరుపయోగ కర్మకాండలో

వేదాలు నిండి ఉన్నాయని మరొక భావం. క్రీ. పూ. 1500 ప్రాంతాల్లో భారతదేశాన్ని ఆక్రమించిన ఆర్యజాతివారు ఆ తరవాత రచించినవి వేదాలనేది ఒక వాదం.

ఈ భావాల వల్ల వేదాలు పల్లెల్లో పాడుకునే పాటల వంటివనే భావం ఏర్పడుతోంది. వేదం తర్వాత బయలుదేరిన శ్రీమద్రామాయణ మహాభారతాదులు సత్యదూరాలయి కల్పనలుగా భావించబడుతున్నాయి. ఎందుకంటే క్రీ.పూ. 1500 నుండి వెయ్యి సంవత్సరాల కాలం చరిత్రకారుల అభిప్రాయం ప్రకారం అంధ యుగం. శ్రీమద్రామాయణ భారతాదులు క్రీ.పూ. 500 తరవాత ఏర్పడినవని వీరు భావిస్తారు. ఆ కాలం నుండి మనకు చరిత్ర తెలుస్తోంది. ఆ కాలంలో శ్రీరామకథ, శ్రీకృష్ణకథ జరిగినట్లు ఆధారాలు లేవు. లోగడ ప్రామాణికంగా భావించబడిన హిందూ వాఙ్మయం ఒట్టి కల్పిత వాఙ్మయంగా చరిత్రకారులు సాధిస్తున్నారు.

హిందువులకు లిపి లేదు. గ్రీకు లిపి నుండో, అరమీన్ లిపి నుండో వారు లిపిని ఎరవు తెచ్చుకొన్నారని ఒక వాదం.

గంగ అనే పదం సంస్కృత పదం కాదు. ఆస్ట్రిక్ భాషా పదం. దానిని ఆర్యులు సంస్కృతీకరించుకొని సంస్కృతంలో చేర్చుకొన్నారని ఒకరి వాదం. దీని వల్ల శ్రీమద్రామాయణం, మహాభారతం, పురాణాలు, వేదాలు మొదలైన చోట్ల ఉన్న గంగ ప్రస్తావనలన్నీ నిరాధార కల్పనలని చెప్పినట్లే గదా!

స్త్రీలకు వేదాలలో సరియయిన స్థానం లేదు. భర్త మరణిస్తే ఆ స్త్రీలను బలవంతంగా నిప్పులోకి తోసి చంపేసేది వేద సంస్కృతి అనేది మరొక విమర్శ.

ఈస్టిండియా కంపెనీ వారు భారతదేశంపై పెత్తనం సాగించే కాలంలో భారతదేశంలో ఉద్యోగం చేయదలచిన ఇంగ్లీషు వారికి లండన్‌లో శిక్షణ ఏర్పాటు చేసేవారు. ఆ శిక్షణలో భారతీయులు అనాగరికులు - అడవి మనుష్యుల వంటివారు, వారికి మతం, సంస్కృతి వంటి పుండవు, వారితో చాలా జాగ్రత్తగా మెలగాలని హెచ్చరించేవారు.

చరిత్ర గ్రంథాలలో పై విమర్శలు చదివినపుడు ఈస్టిండియా కంపెనీ వారు చేసిన హెచ్చరికలు నిజమే అనే భావం కలుగుతుంది.

వేదాభిమానులకు, సత్యాన్ని గ్రహించాలనే జిజ్ఞాసువులకు వేదాలకు సంబంధించిన యథార్థ విషయాలను చెప్పాలని యీ ప్రయత్నం. సద్గురు సాయినాథుని దయవలన నా అన్వేషణకు లభించిన సమాధానాలే ఈ గ్రంథం. శ్రీ వేంకటేశ్వర స్వామి అనుగ్రహం వల్ల ఈ గ్రంథం వెలుగు చూడడానికి నోచుకుంటోంది.

మొదట శ్రుతి సౌరభం ప్రథమ, ద్వితీయ భాగాలు ఒకే గ్రంథంగా ముద్రిద్దా మనుకున్నాము. కాని ఒక ప్రముఖ పండితులు 'ప్రథమ భాగం చరిత్రకు సంబంధించింది' అని, దానికి వేదంతో సంబంధం లేదని సూచించారు. నిజానికి గ్రంథంలో చాలా భాగం చరిత్రలో వేదంపై ఉన్న విమర్శలకు సమాధాన రూపమే. అయినా వారి సూచనకు విలువనిచ్చి దీనిని రెండు భాగాలుగా విభజించడం జరిగింది.

వేదాలపైన విమర్శలు ఇంకా చాలా ఉన్నాయి. వేదాలలో విశేషాలు వెల్లడించవలసినవి మరికొన్ని ఉన్నాయి. అందులో కొన్ని వ్యాసరూపాలను పొందాయి. స్వామి అనుగ్రహించి పాఠకులాదరిస్తే శ్రుతి సౌరభం మూడవ భాగంగా అది గూడా త్వరలో ముద్రణ భాగ్యం పొందవచ్చు.

భ్రమ ప్రమాదాలవల్ల ఏవైన దోషాలు దొరలితే సహృదయులు చెప్పితే కృతజ్ఞతాభివందనములతో సవరించుకొంటానని మనవి.

— రచయిత

# చిత్రాల వివరములు

# హారప్పా సంస్కృతిలో వేద సంస్కృతి

హారప్పా గ్రామం మొదలయిన చోట్ల త్రవ్వకాలలో లభించిన అవశేషాలను సూచించే సంస్కృతి హారప్పా సంస్కృతి. ఈ అవశేషాలు కొన్ని వేద సంస్కృతిని సూచిస్తాయి.



మొహంజోదారో త్రవ్వకాలలో పశుపతి దేవుని ముద్రిక దొరికింది. (తరతరాల భారత చరిత్ర - 21 పుట - చిత్రము 2 వ పేజిలో చూడుడు.) దానిలో రుద్రుడు అతని శిరస్సుపై ఎడమ వైపు అయిదు శిరస్సుల పాము, దాని తలపై మణి, దానికి కుడివైపున గంగా ప్రవాహము, దానికి కుడి ప్రక్క అర్ధ చంద్రుడు కనబడతాడు. ఆ వ్యక్తి ఎడమ చేతి పై భాగంలో క్రై అనే రూపంలో ప్రణవం కనబడుతున్నది. దానికి పైన మేఘం, దానికి వెనుక మత్స్యాలున్నాయి. శివుని శిరస్సుపై జుట్టులేదు. ఆయన వస్త్రాలు కనబడవు.

ప్రణవానికి పైన ఒక భాగం చెరిగిన డమరువు. దానికి కుడి ప్రక్క గొడ్డలి, దానికి కుడి ప్రక్క అయిదు తలల సర్పం, దాని మధ్య తలపై మణి, సర్పానికి కుడి ప్రక్క వంచుతున్న అమృతం గల శంఖపాత్ర, దానికి కుడి వైపున తొక్కచీల్చ బడుతున్న కర్ర, దానికి ప్రక్క ఒక ఏనుగు, దాని క్రింద మనిషి ఉన్నారు. దాని క్రింద ఒక పశు శిరస్సు, దాని క్రింద బాణం వంటి ఆయుధం ఉన్నాయి. ఆయన భుజాలకు, చేతులకు అలంకారాలున్నాయి.

రుద్రుని క్రింద భాగంలో అస్పష్టంగా ఉన్న పశువు రూపం ఉంది. ఈ వర్ణన రుద్రునిదని తెలుస్తోంది. దీనిని మూడు తలల పశుపతి దేవుని ముద్రికగా చరిత్ర కారులు చెబుతున్నారు. (తరతరాల భారత చరిత్ర - 21 పుట) కొందరు రెండు కొమ్ములున్నట్లు వర్ణించారు (చరిత్రలో మతాలు - 2 పుట). కాని దీనికి మూడు తలలు, కొమ్ములు లేవు. ఉన్న శిరస్సుకు నుదుట అడ్డంగా కన్ను, దానికి పైన అస్పష్టంగా రెండు రేఖలు కనబడుతున్నాయి.

ఇక్కడ వర్ణించిన వస్తువులు వేదంలో, మంత్రశాస్త్రంలో రుద్ర రూప వర్ణనలలో కనబడుతున్నాయి.

మం - యోవేదాదౌ స్వరః ప్రోక్తో వేదాన్తేచ ప్రతిష్ఠితః
తస్య ప్రకృతి లీనస్య యః పరస్స మహేశ్వరః

(వేద ప్రారంభంలో ఏ ప్రణవం చెప్ప బడుతోందో, ఉపనిషత్తులలో ఏ ప్రణవం ప్రతిపాదింప బడిందో, దానిలో అకారాన్ని ఉకారంలో, దానిని మకారమనే ప్రకృతిలో లీనం చెయ్యగా దానికి తరువాత నాదంలో ధ్యానింపదగినవాడు మహేశ్వరుడు. తైత్తిరీయారణ్యకం 10 ప్ర. - 12 అ -3) అని శ్రుతి ప్రణవం కంటె పరమైన వాడు పరమేశ్వరుడని చెప్పింది.

శ్లో ॥ శాంతం పద్మాసనస్థం శశిధర మకుటం పంచవక్త్రం త్రినేత్రం
శూలం వజ్రంచ ఖడ్గం పరశు మభయదం దక్షభాగే వహన్తమ్

నాగం పాశఞ్చఘంటాం ప్రళయ హుతవహం సాంకుశం వామ భాగే
నానాలంకార యుక్తం స్ఫటిక మణినిభం పార్వతీశం నమామి.

ఈ శ్లోకంలో పేర్కొన్న శశి(చంద్రుడు) మూడవ నేత్రం, అలంకారాలు, గొడ్డలి, మూడుకన్నులు, పశుపతి దేవుని ముద్రికలో ఉన్నాయి.

శ్లో॥ వందే శంభుముమాపతిం సురగురుం వందే జగత్కారణం
వందే పన్నగ భూషణం మృగధరం వందే పశూనాం పతిమ్
వందే సూర్య శశాంక వహ్నినయనం వందే ముకుంద ప్రియం
వందే భక్తజనాశ్రయం చ వరదం వందే శివం శంకరమ్

ఈ శ్లోకంలో పేర్కొన్న పన్నగ భూషణం (పన్నగం భూషణంగా కలవాడు.) మృగధరం (మృగాన్ని ధరించినవాడు) పశూనాంపతిం (పశువులకు పతి) అనే లక్షణాలు ఈ ముద్రికలో కనబడతాయి. కాని మృగానికి బదులు మృగ శిరస్సు మాత్రం ధరించినట్లు ముద్రికలో చిత్రించాడు. 'సర్వస్య గాత్రస్య శిరః ప్రధానమ్' (శరీరానికి అంతటికీ శిరస్సు ముఖ్యము) అనే న్యాయాన్ననుసరించి శిరస్సు మాత్రం చిత్రించారేమో!

శ్లో॥ హస్తాభ్యాం కలశ ద్వయామృత రసైః ఆప్లావయన్తం శిరో
ద్వాభ్యాంతౌ దధతం మృగాక్షవలయే ద్వాభ్యాం వహన్తం పరమ్
అఙ్కన్యస్త కరద్వయామృత ఘటం కైలాస కాంతం శివం
స్వచ్ఛాంభోజగతం నవేందు ముకుటం దేవం త్రినేత్రం భజే
(మంత్ర మహార్ణవం 1 భాగం 96 పుట)

ఈ శ్లోకంలో శివుడు రెండు పాత్రలతో శిరస్సుపై అమృత రసం అభిషేకించు కొనుచున్న విషయం వర్ణించబడింది. పై ముద్రికలో ఒక పాత్రతో ఏదో రసం పోసుకొన్న రూపం చిత్రించ బడింది. పూర్వం శంఖాలతో పాత్రలు చేసేవారు. ఇక్కడ పాత్ర శంఖం వలె కనబడుతోంది.

'శంఖ పాత్రైస్స్రువై స్స్రుగ్భిః పాత్రై రర్ఘ్యాభి పూరితైః', అని శంఖ పాత్రలను వాల్మీకి మహర్షి పేర్కొన్నారు. (వాల్మీకి రామాయణం, బాలకాండ 73 స. 22 శ్లో.)

కలశానికి ఎడమవైపున తొక్క తీయ బడుతున్న కాండం కనబడుతుంది. పై పొరలను తొలగిస్తే లోపల కఱ్ఱ దర్శనమిచ్చినట్లు అన్నమయాది కోశాలను దాని లోపల ఉన్న ఆత్మ కంటె వేరుగా భావించి చూస్తే లోపలి పరమాత్మ దర్శనమవుతుందని ఉపనిషత్తు తెలుపుతుంది. ఇది దాన్ని సూచిస్తుందేమో. శివ సహస్రనామావళిలో 'వంశః' (ఎదురు 100 శ్లో) అనే నామం ఉందని గూడా ఇక్కడ గమనించాలి.

రుద్రునకు గంగాధరుడనే పేరు ఉంది. దీనికి గంగను ధరించిన వాడని అర్థము.

"శంభురీశః పశుపతిః శివశ్శూలీ మహేశ్వరః
ఈశ్వరశ్శర్వ ఈశానః శంకరశ్చంద్రశేఖరః
భూతేశః ఖండ పరశుః గిరీశో గిరిశో మృడః
మృత్యుంజయః కృత్తివాసాః పినాకీ ప్రమథాధిపః
ఉగ్రః కపర్దీ శ్రీకంఠశ్శితికంఠః కపాలభృత్
వామదేవో మహాదేవో విరూపాక్షస్త్రిలోచనః
కృశాను రేతా స్సర్వజ్ఞో ధూర్జటిః నీలలోహితః
హరః స్మరహరో భర్గస్త్ర్యంబక స్త్రిపురాంతకః
గంగాధరోంధకరిపుః క్రతుధ్వంసీ వృషధ్వజః

వ్యోమకేశో భవో భీమః స్థాణూ రుద్ర ఉమాపతిః అని ప్రాచీన నిఘంటువు చెప్పిన శివుని నామాల్లో గంగాధర పదమే కాక పశుపతి, వ్యోమకేశుడు, చంద్ర శేఖరుడు, ఖండపరశువు, శితి కంఠుడు, గంగాధరుడు, త్రిలోచనుడు, హరుడు అనే నామాలున్నాయి. (అమరకోశం 1 కాండ 30 నుండి 34 శ్లో.)

పరశువు గండ్ర గొడ్డలిని తెల్పుతుంది. అది సగమయితే ఖండ పరశువవుతుంది. అంటే మామూలు గొడ్డలి. శివుని వద్ద ఉన్నదదే. చిత్రంలో గూడ ఇదే కనబడుతుంది. నల్లని కంఠం కలవాడు శితికంఠుడు. ముద్రికలో శివుని కంఠం దగ్గర ఒక చుక్క కనబడుతుంది.

శివాష్టోత్తర శతనామ స్తోత్రములో గంగాధరః (శ్లో. 6) కవచీ (కవచం కలవాడు) వ్యోమకేశః, దిగంబరః(12శ్లో) మృగపాణిః (చేతియందు మృగం కలవాడు 6 శ్లో.) అనే నామాలున్నాయి. ఈ లక్షణాలు పై ముద్రికలో కనబడుతున్నాయి.

హరుడు గజచర్మం ధరిస్తాడు. ఆయన కుమారుడు గజాననుడు. కనుక ఈ ముద్రికలో గజ చిత్రం గూడా ఉంది. శివ సహస్రంలో గజేశ్వరః (ఏనుగు కధిపతి 148 శ్లో.) అనే నామం ఉంది.

'ఈశానస్సర్వ విద్యానామీశ్వర స్సర్వ భూతానాం బ్రహ్మాధిపతిః' (ఆయన అన్ని విద్యలకు ప్రభువు. జీవులందరికి ప్రభువు.) అని శ్రుతి చెప్పింది. నరర్షభః (మానవ శ్రేష్ఠుడు 148శ్లో.) అనే నామం శివ సహస్రంలో ఉంది.

మానవులకాయన ప్రభువని తెల్పడానికి ముద్రికలో మానవ చిత్రం ఉండి ఉండవచ్చు. ఆయన వాహనం పశువు కనుక క్రింద పశుచిత్రం కనబడుతోంది.

శ్లో ॥ దేవం వందే శరధి శరధిం దేవతా సార్వభౌమం
వ్యాస ప్రష్టా భువన విదితా యస్య వాహాధి వాహః
భూషాపేక్షే భువన మకలం పుష్కరం పుష్కరాణి,
కాశీ పాలా కృతముఖ ముఖాశ్శృంగవ ప్రద్యోతః

ప్రముఖాన్ని అంకుశం పొడిగా కలవాడు దేవతా సార్వభౌముడు అయిన పరమేశ్వరునికి నమస్కరిస్తున్నాను. లోక ప్రసిద్ధులయిన వ్యాసాదిమునులు అయిన వాహనాలయిన వేదాలను మోస్తూ ఉంటారు. ఆయన నాగాలంకారాలను ధర

పరచే పెళ్ళి అతల లోకం. ఆయన పూలతోట చుక్కలనే పూవులతో విలసిల్లే ఆకాశం. ఆయన వస్త్రాలనే దిక్కులను రక్షించేవారు ఇంద్రాది దిక్పాలకులు. ఆ స్వామి మంచి గంధంగా మన్మథ చితా భస్మాన్ని పూసుకుంటాడు.) అనే ధ్యాన శ్లోకం రుద్రుడు దిగంబరుడని, నాగాభరణుడని తెల్పడమే గాక ఆకాశానికి ఆయనకు ఉన్న అనుబంధం స్పష్టం చేస్తోంది.

మహా భారతంలో ఉన్న శివ సహస్ర నామాలలో ముండః (తలపై జుట్టు లేనివాడు 45 శ్లో) దిగ్వాసాః (దిగంబరుడు 42 శ్లో.) జ్యోతిషామయనం (చుక్కల కాధారమయిన వాడు 57 శ్లో.) మహామేఘ నివాసీ (గొప్ప మేఘమందు నివసించేవాడు 82 శ్లో.) వ్యక్తావ్యక్తః (కనబడి కనబడని వాడు 124 శ్లో.) త్రిలోచనః (మూడు కన్నులు కలవాడు 128 శ్లో.) గోవృషేశ్వరః (ఆబోతుకధిపతి 140 శ్లో.) వజ్రీ (వజ్రము కలవాడు 148 శ్లో.) అనే నామాలున్నాయి. ఈ ముద్రికలో దీనికనుగుణమయిన చిత్రాలు కనబడుతున్నాయి గదా! ముద్రికలో సగం రూపం చిత్రించబడింది. మిగిలిన సగం చిత్రించబడలేదు. కనుక వ్యక్తావ్యక్తుడనే లక్షణం గూడా ఉందన్న మాట.

ఆకాశం జుట్టుగా కలవాడు, దిక్కులు వస్త్రాలుగా కలవా డనే నామాలు జుట్టు, బట్టలు లేనివాడనే భావాన్ని సూచిస్తాయి.

ఇవన్నీ హరప్పా నాగరికతలో రుద్రారాధన సంప్రదాయమున్నదని నిరూపిస్తాయి. కనుక హరప్పా ప్రజలు తమ మత విశ్వాసాన్ని వెల్లడించే శాసనాలు మిగిల్చిపోలేదని చెప్పే చరిత్రకారుల మాట పునః పరిశీలించుకోదగింది. (తరతరాల భారత చరిత్ర - 21పుట) ఈ రుద్రారాధన వైదికమే.

'అథర్వశీర్షః సామాస్య ఋక్సహస్రామితేక్షణః, యజుః పాద భుజః (అథర్వవేదం శిరస్సుగా, సామవేదం ముఖముగా, వేల ఋక్కులు కన్నులుగా, యజుస్సులు పాదాలుగా, భుజాలుగా కలవాడు - 92 శ్లో.) అనే శివ సహస్ర నామాలు ఇచట గమనించాలి. శ్రీ కృష్ణ యజుర్వేదంలో నమకం రుద్ర

నమస్కారాలతో నిండి ఉంది. (తైత్తిరీయ సంహిత 4 అ-5ప్ర.) తైత్తిరీయ యజురారణ్యకంలో ఎన్నో రుద్రస్తుతులున్నాయి. (తైత్తిరీయ యజురారణ్యకం 10 ప్ర. 1 అనువాకంలో 5వనన, 16,17,18,19,20,21,22,23,24,25,52, 53, 56,74,75)

ఋగ్వేదంలో రుద్రసూక్తం ఉంది. (2మం. 33సూ.) దీనిలో చాలాచోట్ల రుద్రుణ్ణి వృషభ పదంతో స్తుతించడం గమనించదగింది.

'మాత్వా రుద్ర చుక్రుధా మానమో భిర్మాదుష్టుతీవృషభ మానహూతీ'
(2-33-4)

'అవర్త్రా రపసో దైవ్యాస్యాభీను మా వృషభ చక్షమీథాః
(పై గ్రంథం 7 మం.)

'ప్ర బభ్రవే వృషభాయ శ్వితీచే' (పై గ్రంథం 8 మం.)

'ఏవా బభ్రో వృషభ చేకితాన' (పై గ్రంథం 15 మం.)

'తత్పురుషాయ విద్మహేచక్రతుండాయధీమహి, తన్నోనందిః ప్రచోదయాత్' (తైత్తిరీయారణ్యకం 10 ప్ర. 1 అ. 5వ) అని శ్రీకృష్ణ యజుర్వేదంలో వృషభ గాయత్రి కూడా ఉంది. హరప్పా తవ్వకాలలో వృషభ ముద్రలు చాలా దొరికాయి. (తరతరాల భారత చరిత్ర - 21 పుట) ఈ సందర్భంలో శివ సహస్ర నామాలలో వృషరూపః (ఆబోతు రూపంలో ఉన్నవాడు 36 శ్లో.) నందిః (నంది 75శ్లో.) గవాంపతిః (ఆబోతు 72 శ్లో.) అనే నామాలు గమనించదగ్గవి.

హరప్పా సంస్కృతిలో పశుపతి దేవుని ముద్రిక దొరికింది. ఆ పశుపతి రుద్రుడని పైన గమనించాము. పశుపతి పదంతో వేద మంత్రాలు చాలా ఉన్నాయి.

'నమో భవాయచ రుద్రాయచ నమశ్శర్వాయచ పశుపతయేచ' (తైత్తిరీయయజుస్సంహిత 4 కాం. 5 ప్ర. 12వ.)

'నమశ్శర్వాయచ పశుపతయేచ' (పై గ్రంథం 17వ.)

'నమో రుద్రాయ పశుపతయే స్వాహా' (తైత్తిరీయారణ్యకం 10 ప. 87అ.)

'అమ్బికా పతయ ఉమాపతయే పశుపతయే నమోనమః' (పై గ్రంథం 22అ) హరప్పా ముద్రికలలో రావిచెట్టు బొమ్మలు లభించాయి. (తరతరాల భారత చరిత్ర - 22 పుట) అథర్వణ వేదంలో రావిచెట్టుమీద సూక్తం ప్రశంసిస్తోంది. (3 కాం. 2అ. 6సూ.)

"యస్వసాహమాన శృరుసి సాసహాన ఇవ ఋషభః, తేనాశ్వత్థ త్వయావయం సపత్నాన్సహిషీ మహి" (శత్రువులను తిరస్కరించే అశ్వత్థం ఇతరాలను ఓడించే ఋషభం వంటిది. ఓ అశ్వత్థమా! నీ సహాయంతో మేం శత్రువులను ఓడిస్తున్నాము. (అథర్వణ. 3కాం. 2అ. 6సూ) శివసహస్ర నామాలలో అశ్వత్థః (70శ్లో) అని నామం ఉంది.

హరప్పా సంస్కృతిలో లభించిన చిత్రలిపిలోని చిత్రాలలో యజ్ఞ విషయాలున్నాయి.



"హరప్పా యందలి ఒక శిల్పములో ఛేదింపబడిన అశ్వత్థ వృక్షశాఖ యొకటి, మేకను పట్టుకున్న పురుషుడు, శాఖ ప్రక్కన ఒకస్త్రీ, వరుసగా నిలబడిన కొందరు పురుషులు గలరు. వేదకాలమును మొదట స్థూలముగా నిర్ణయించుకొని దానికి ముందుగనే హరప్పా శిల్పముండి యుండవలెనని తలచుటచే చరిత్ర కారులకీ శిల్పమును గూర్చిన సమన్వయము కుదురలేదు. శిల్ప చిహ్నమును యాగ సంబంధిగా తెలిసికొనక గ్రామదేవతకు బలి యిచ్చునట్లు భావించియున్నందున అశ్వత్థ వృక్ష శాఖ గూర్చిన వివరము గూడ వారికి లభించుట లేదు." అని Director General of Archaeology యొక్క అభిప్రాయము.

'యజ్ఞము కొఱకు మాత్రమే యశ్వత్థ వృక్షమును ఛేదింపనగును. ఇతర సమయములందు ఛేదించుట పాపము. ఇది అనాది సిద్ధమగు భారతీయ సంప్రదాయము. ఈ చిత్రము యాగ యజమానుడు, అతని ధర్మపత్ని, ఋత్విగ్గణము, యాగపశువు, అశ్వత్థ శాఖతో కూడిన ఒక యాగశాల అని తెలియనగును. (వేదములు, భారతీ నిరుక్తి xLvii పుట) అని శ్రీకామకోటి పీఠాధీశులు జగద్గురు శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతీ స్వామి వారు వెల్లడించారు.



నావ్దా తొలి తవ్వకాలలో శిరస్సుపై పిడతలను ధరించిన యువతుల నాట్యం (ఇరువురు ధరించారు. ఇరువురు ధరించలేదు.) కనబడుతోంది. (ప్రాచీన భారత దేశ సంస్కృతి, నాగరికత చివరి బొమ్మలు 40 వ చిత్రం కుండ తునక వర్ణచిత్రం) శిరస్సుపై కుండలు ధరించిన యువతుల నాట్యం శ్రీకృష్ణయజుర్వేదంలో యజ్ఞాంగంగా పేర్కొనబడింది. (శ్రీకృష్ణ యజుస్సంహిత 7-5-10)



మొహంజోదారోలో బండరాయి (దంచేరాయి) నూరుడు రాయి బయల్పడ్డాయి (పై గ్రంథం 4) యజ్ఞంలో ఉపల, ద్రుషత్ అనే పేరులు గల బండ, దంచే రాళ్ళనుపయోగించి సోమం దంచి రసం తీస్తారు.

వృషభ ముద్రికలో వృషభం పైన, యజ్ఞంలో ఉపయోగించే పాత్రలను పోలిన చిహ్నాలుండడం గమనించదగినది. వృషభానికి పైన కుడివైపున ఇడా పాత్ర, దానికి ఎడమ ప్రక్క వరుసగా ముసలం, ప్రాశిత్ర హరణం, ఉష్మ అంగారాలు పట్టుకొనేది, చమసం లేక వడగట్టేది, చక్రం, ఉపలం వంటి (తరతరాల భారత చరిత్ర - 21 పుట) వీటన్నిటికీ యజ్ఞంలో వినియోగం ఉంటుంది. వీటిలో కొన్నింటికి యజ్ఞాయుధాలు అని పేరు.

"స్ఫ్యశ్చ కపాలాని చాగ్నిహోత్ర హవణీచ శూర్పంచ కృష్ణాజినంచ శమ్యాచోలూఖలంచ ముసలంచ దృషచ్చోపలా చైతానివై దశయజ్ఞాయుధాని" అని వేదం పేర్కొన్న యజ్ఞాయుధాలలో ఖడ్గ శమ్య, ముసలం, దృషత్, ఉపల కనబడుతున్నాయి. (తైత్తిరీయ యజుస్సంహితా - 1 కాం. 8అను, 26, 27 పనసలు.) వీటివల్ల వైదిక యజ్ఞ ప్రక్రియ సింధు నాగరికతలో ఉందని తెలుస్తుంది.

హరప్పా సంస్కృతిలో దేవీ ప్రతిమలు దొరకడం వల్ల ఆ ప్రజలు దేవీ ప్రతిమల్ని కొలిచి ఉండవచ్చు. (తరతరాల భారత చరిత్ర - 22 పుట.) వేదంలో దేవీ ఆరాధనకు చెందిన మంత్రాలు చాలా ఉన్నాయి. ఋగ్వేదంలో ఉషాసూక్తం (1-113-11) యజుర్వేదంలో దుర్గాసూక్తం ఉన్నాయి.

తామగ్నివర్ణాం తపసా జ్వలంతీం
వైరోచనీం కర్మ ఫలేషు జుష్టామ్
దుర్గాం దేవీగ్ం శరణ మహం ప్రపద్యే
సుతరసితరసే నమః

అగ్ని సమాన వర్ణం కలిగినదీ, తన ప్రతాపం చేత శత్రువులను నాశం చేసేది, విశేషంగా ప్రకాశించే పరమాత్మునిచే చూడబడిందీ, ఉపాసకులచే ఫలకోరికల కోసం ఆరాధింపబడేది అయిన దుర్గాదేవిని శరణు వేడుతున్నాను. సంసారాన్ని సులభంగా దాటడానికి హేతువైన ఓ దేవీ నీకు నమస్కారం. (తైత్తిరీయారణ్యకం 10 ప్ర. 2 అను, 1 మం) భావనోపనిషత్తు త్రిపురా తాపన్యుపనిషత్తు మొదలయినవి దేవీ ఉపాసనను తెలుపుతాయి.

హరప్పా ప్రస్తరాలలో ఓ పురుష దేవత పద్మాసనం వేసుకున్నట్లు చిత్రించబడిన ముద్రిక ఉంది. (తరతరాల భారత చరిత్ర - 22 పుట.)

యోగశాస్త్ర కర్త అయిన పతంజలి "స్థిరసుఖమాసనమ్" (నిశ్చలమయి సుఖకరమయినది ఆసనం. యోగశాస్త్రం, 2పా 46 సూ.) తపస్స్వాధ్యాయేశ్వర

ప్రతిధానాని క్రియాయోగః (తపస్సు, వేదాధ్యయనం, ఈశ్వర ప్రతిధానం క్రియాయోగం, యోగ -2అ-1సూ.) అని అనడాన్ని, వేదాధ్యయనాన్ని పేర్కొన్నాడు.

పద్మాసనాల్లో బద్ధ పద్మాసనం, కుక్కుటాసనం, మత్స్యేంద్ర పద్మాసనం, ముక్త పద్మాసనం మొదలయిన భేదాలున్నాయి. (హఠయోగ ప్రదీపిక 44 నుండి 48శ్లో.) శివ సహస్ర నామాలలో తపోమయః (తపోమయుడు 149శ్లో.) యోగాధ్యక్షః (యోగమున కధ్యక్షుడు 77 శ్లో.) అనే నామాలున్నాయి. ఇవి పద్మాసనానికి, యోగానికి శివునికి వైదిక సంస్కృతికి గల అనుబంధాన్ని వెల్లడిస్తున్నాయి గదా!



మొహంజోదారోలో దొరికిన గడ్డం మనిషి ప్రతిమలో చెవులకు తమ్మెలున్నాయి. కర్ణవేధ అనే పేరుతో ఇప్పటికీ చెవులకు తమ్మెలు కుట్టించడం హిందువుల ఆచారం.

శ్లో॥ శతోరజాత దంతస్య మాతు రుత్సంగ సర్పిణః
హింతో వేధయేత్ కర్ణౌ మాతా ద్విగుణ సూత్రకః

(పురుషార్థ చింతామణి - 435 పుట) అనే వ్యాస వచనం ధర్మశాస్త్ర గ్రంథాల్లో ఉదాహరించబడింది. దీనిలో తల్లి ఒడిలో దంతాలు రాని పిల్లవానికి చెవులు కుట్టాలని చెప్పారు. పై గడ్డం మనిషికి గడ్డం, మీసాలు, పై జుట్టు ఉన్నాయి.

శిరస్సుమీద జుట్టును ముఖం మీద ఉండే గడ్డం మీసాలను నెలనెలకూ తొలగించడం వైదిక సంప్రదాయం.

కేశశ్మశ్రువపతే నఖాని నికృన్తతే (శిరస్సుపై జుట్టును గడ్డం మీసాలను గొరిగించాలి. గోళ్ళు తీయించాలి. తైత్తిరీయ సంహిత 6 కాం. 1ప్ర - 1 అ)

కాని కొన్ని సందర్భాలలో కొంత కాలం వరకు జుట్టును గడ్డం మీసాలను తొలగించక పోవడం గూడా వైదిక సంప్రదాయమే.

ఊర్ధ్వం వివాహాత్పుత్రస్య తథాచ వ్రత బంధనాత్
అబ్దన్ ముండనం నైవ వర్షం వర్షార్ధమేవచ

(కుమారుని వివాహము తరువాత సంవత్సర కాలం, కుమారుని ఉపనయనము తరువాత ఆరు నెలలు జుట్టును గడ్డం మీసములను తీయించరాదు. ధర్మ సింధుసారం 3వ పరిచ్ఛేదం, పూర్వార్థం - అథముండనోద్వాసానన్తరం కార్యా కార్య విచారః 230 పుట.) దీక్ష మధ్యల్లో కూడా వీటిని తొలగించరు. ఇతనికి నుదుట పై భాగంలో ఎత్తుగా బొట్టువలె కనబడుతోంది. నుదుట తిలకం ధరించడం కొందరిప్పటికి పాటిస్తారు.

త్రిపుండ్రం సుర విప్రాణాం వర్తులం నృపవైశ్యయోః
అర్ధచంద్రంతు శూద్రాణా మన్యేషా మూర్ధ్వ పుండ్రకమ్

(సురలు, విప్రులు త్రిపుండ్రం, రాజులు, వైశ్యులు గుండ్రముగా, శూద్రులు అర్ధ చంద్రాకారంగా, ఇతరులు ఊర్ధ్వ పుండ్రముగా తిలకం ధరించాలి.) అని తిలక విధి ఉంది. (ధర్మ ప్రవృత్తి -20 పుట.) ఇది అనాటి మత గురువు ప్రతిమ అని చరిత్రకారు లూహించారు. (*తరతరాల భారత చరిత్ర - 22 పుట*)

ఈ వ్యక్తి గుండ్రని మూడు దళాల పుష్పాలు శిల్పించిన ఉత్తరీయాన్ని ధరించాడు. ఉత్తరీయ ధారణాన్ని వేదమిలా పేర్కొంది.

'అజినం వాసోవా దక్షిణత ఉపవీయ దక్షిణం బాహు ముద్ధరతే వధత్తే సవ్యమితి యజ్ఞోపవీతమేతదేవ విపరీతమ్ ప్రాచీనావీతమ్'

(తైత్తిరీయారణ్యకమ్ 2 ప్ర-1అను. 2 వనన)

కృష్ణాజినం గాని, వస్త్రంగాని దక్షిణ భాగంలో చేతిక్రింద వ్రేలాడేలాగ, కుడిచేయి పైకి ఉండేలా ఎడమ భుజానికి పైన ధరించడం యజ్ఞోపవీతం. దీనికి విపరీతంగా కుడి భుజం మీద వస్త్రం ఎడమ భుజం క్రిందుగా వల్లెవాటుగా వేసుకోవడం ప్రాచీనావీతం. "ప్రాచీనావీతం పితౄణాముపవీతం దేవానామ్" (ప్రాచీనా వీతం పితృదేవతలకు, ఉపవీతం దేవతలకు చెందినది) పితృ కర్మలలో ప్రాచీనావీతం గాను, దేవ కర్మలలో ఉపవీతంగాను ధరిస్తారు. కనుక ఈ ఉత్తరీయ ధారణం వైదిక పద్ధతి. (తైత్తిరీయారణ్యకం-10ప్ర. 2అను. 1 మం.)

ఈ ప్రతిమ ప్రాచీనావీతంగా ఉత్తరీయాన్ని ధరించిందని చెప్పవచ్చు. అద్దంలో ప్రతిబింబం వ్యత్యస్తంగా కనబడుతుంది. ఎడమ పైట వేసుకున్న స్త్రీ ప్రతిబింబం అద్దంలో కుడిపైట వేసుకున్నట్లు కనబడుతుంది గదా! ప్రతిమ ప్రతిబింబం వంటిదే అనే భావంలో కూడ ఈ ప్రతిమకు ఉత్తరీయాన్ని కుడి భుజంపై చిత్రించి ఉండవచ్చు. ఆ కాలంలో అద్దాలున్నాయి. *(తరతరాల భారత చరిత్ర - పుట 28)*

ఈ ప్రతిమ రక్షను ధరించింది. *(తరతరాల భారత చరిత్ర - 22 పుట.)* అక్కడ రక్షరేకులు చాలా దొరికాయి.(20 పుట) ఉపనయన వివాహాది కర్మలలో ప్రారంభంలో రక్షాబంధనం ధరించడం వైదిక సంప్రదాయం.

ఇహాహ్వాను జ్ఞాత ఋ ద్యూత్ర వృష్టియం బ్రహ్మణాం ఇష్టిత మగ్గ వీరమ్
అర్ధ స్తోమన వర్ణ్యవతేన మధ్య మిదం వాతేన సగరేణ రక్ష

(శ్రీకృష్ణ యజుర్వేదం - 4కాం - 4 ప్ర - 12 అ - 2 వ.)

(బలాన్ని ధరించేది, మేల్కొన్న పుంస్త్వం కలది, ఓజోబలమిచ్చేది, శోభించేది, గొప్ప కుమారు నిచ్చేది అయిన బృహత్సామ త్రిష్టుప్ ఛందస్సుతో మమ్ము రక్షించుగాక. ఓ ఇంద్రా! వాయువుతో కూడిన వాడవై పఞ్చదశ స్తోమంతో మా శరీరాన్ని రక్షించు) అనే మంత్రం రక్షాబంధనం కట్టే సమయంలో పఠిస్తారు.

ఆ నాగరికతలో చనిపోయిన కొందరిని భూస్థాపితం చేశారు. చనిపోయిన మరికొందరి అస్థికలు మాత్రం పూడ్చిపెట్టారు. (తరతరాల భారత చరిత్ర - 22పుట) కొందరిని సమాధి చేయడం కొందరిని దహనం చేయడం అనే పద్ధతులు వైదిక సంప్రదాయంలో ఉన్నాయి. సన్యాసులను, యోగులను, చిన్న పిల్లలను ఖననం చేయడం, ఇతరులను దహనం చేసి ఎముకలు నదీ జలాల్లో కలపడం హిందూ ధర్మశాస్త్రాల్లో ఉంది.

దహనం చేసిన తరువాత నదిలో కలపడానికి ముందు ఎముకలను ఒక కుండలో పెట్టి వృక్షం మొదట గాని అడవిలో గాని పాతిపెడతారు. ఒకవేళ ఏ కారణం చేతనైనా నదిలో కలపడం జరగకపోతే అలాగే ఉండి పోతాయి గదా! మహానదులకు వెళ్ళడం ఇప్పటి వలె పూర్వకాలం సులభం కాదుగదా!

హరప్పా నాగరికతలో ఇటుకలను కాల్చి భవనాలు కట్టేవారు. (తరతరాల భారత చరిత్ర - 18 పుట) వైదిక నాగరికతలో గూడ ఇటుకలను కాల్చి ఇష్టకోపధానం ద్వారా యజ్ఞ కుండ నిర్మాణం ఉంది.

హరప్పా నాగరికతలో చిన్న ఇంటికి గూడా నూతులున్నాయి. (తరతరాల భారత చరిత్ర - 19 పుట.) ఋగ్వేదంలోనే నూతులున్నాయి. గౌతమ మునికి దప్పిక తీర్చడం కోసం మరుత్తులు బావిని ఏర్పరచిన గాథ అక్కడ ఉంది. (ఋగ్వేదం-1అష్ట-85సూ.) యజుర్వేదంలో గ విషయం విస్తృతంగా ఉంది. (4కా-2ప్ర-56మ)



మొహంజోదారో కోటలో ప్రజల నిర్మాణ దక్షతకు ప్రతీకగా నిర్మించింది బ్రహ్మాండమైన స్నానవాటిక. *(తరతరాల భారత చరిత్ర* - 19 పుట) ఇది ఈనాటి పెద్ద ఈత కొలనుని పోలి ఉంది. (19పుట)

ఈ తటాకం దీర్ఘ చతురస్రాకారంతో 29×39 అడుగులుంది. లోతు 8 అడుగులు. ఈ తటాకం మామూలు స్నాన సౌకర్యం కోసం నిర్మించింది కాదు. ఆ ప్రాంతంలో ప్రతియింటికి చక్కటి స్నానం గదులు మంచి నూతులు ఉన్నాయి. సింధునది ఈ దుర్గం ప్రక్కనుంచే ప్రవహించింది. కనుక ధార్మికమయిన స్నానాలకోసం దీనిని నిర్మించుకొని ఉంటారు. స్త్రీలు స్నానం చేసిన తరువాత బట్టలు మార్చుకోవడం కోసం ప్రక్కన గదులు నిర్మించి ఉంటారు.

నదీస్నానం తరువాత సరోవర స్నానానికి వైదికులు ప్రాధాన్యమిచ్చేవారు వారి దృష్టిలో కూపస్నానం శ్రేష్ఠం కాదు.

భూమిష్ఠ ముద్ధృతాత్పుణ్యం తతః ప్రస్రవణోదకమ్
తతో పి సారసం పుణ్యం తతః పుణ్యం నదీ జలమ్

(బలాన్ని ధరించేదీ, మేల్కొన్న పుంస్త్వం కలదీ, ఓజోబలమిచ్చేదీ, శోభించేదీ, గొప్ప కుమారు నిచ్చేదీ అయిన బృహత్సామ త్రిష్టుప్ ఛందస్సుతో మమ్ము రక్షించుగాక. ఓ ఇంద్రా! వాయువుతో కూడిన వాడవై పఞ్చదశ స్తోమంతో మా శరీరాన్ని రక్షించు) అనే మంత్రం రక్షాబంధనం కట్టే సమయంలో పఠిస్తారు.

ఆ నాగరికతలో చనిపోయిన కొందరిని భూస్థాపితం చేశారు. చనిపోయిన మరికొందరి అస్థికలు మాత్రం పూడ్చిపెట్టారు. (తరతరాల భారత చరిత్ర - 22పుట) కొందరిని సమాధి చేయడం కొందరిని దహనం చేయడం అనే పద్ధతులు వైదిక సంప్రదాయంలో ఉన్నాయి. సన్యాసులను, యోగులను, చిన్న పిల్లలను ఖననం చేయడం, ఇతరులను దహనం చేసి ఎముకలు నదీ జలాల్లో కలపడం హిందూ ధర్మశాస్త్రాల్లో ఉంది.

దహనం చేసిన తరువాత నదిలో కలపడానికి ముందు ఎముకలను ఒక కుండలో పెట్టి వృక్షం మొదట గాని అడవిలో గాని పాతిపెడతారు. ఒకవేళ ఏ కారణం చేతనైనా నదిలో కలపడం జరగకపోతే అలాగే ఉండి పోతాయి గదా! మహానదులకు వెళ్ళడం ఇప్పటి వలె పూర్వకాలం సులభం కాదుగదా!

హరప్పా నాగరికతలో ఇటుకలను కాల్చి భవనాలు కట్టేవారు. (తరతరాల భారత చరిత్ర - 18 పుట) వైదిక నాగరికతలో గూడ ఇటుకలను కాల్చి ఇష్టకోపధానం ద్వారా యజ్ఞ కుండ నిర్మాణం ఉంది.

హరప్పా నాగరికతలో చిన్న ఇంటికి గూడా నూతులున్నాయి. (తరతరాల భారత చరిత్ర - 19 పుట.) ఋగ్వేదంలోనే నూతులున్నాయి. గౌతమ మునికి దప్పిక తీర్చడం కోసం మరుత్తులు బావిని ఏర్పరచిన గాథ అక్కడ ఉంది. (ఋగ్వేదం-1అష్ట-85సూ.) యజుర్వేదంలో గూడా నూతుల విషయం విస్తృతంగా ఉంది. (4కా-2ప్ర-56మ)



మొహంజోదారో కోటలో ప్రజల విశ్వాస దక్షతకు ప్రతీకగా నిర్మించింది ప్రసిద్ధమైన స్నానవాటి i. (*తరతరాల భారత చరిత్ర* - 19 పుట) ఇది ఈనాటి పెద్ద ఈత కొలనుని పోలి ఉంది. (19పుట)

ఈ తటాకం దీర్ఘ చతురస్రాకారంలో 29×39 అడుగులుంది. లోతు 8 అడుగులు. ఈ తటాకం మామూలు స్నాన సౌకర్యం కోసం నిర్మించింది కాదు. ఆ ప్రాంతంలో ప్రతియింటికి చక్కటి స్నానం గదులు మంచి నూతులు ఉన్నాయి. సింధునది ఈ దుర్గం ప్రక్కనుంచే ప్రవహించింది. కనుక ధార్మికమయిన స్నానాలకోసం దీనిని నిర్మించుకొని ఉంటారు. స్త్రీలు స్నానం చేసిన తరువాత బట్టలు మార్చుకోవడం కోసం ప్రక్కన గదులు నిర్మించి ఉంటారు.

నదీస్నానం తరువాత సరోవర స్నానానికి వైదికులు ప్రాధాన్యమిచ్చినారు వారి దృష్టిలో కూపస్నానం శ్రేష్ఠం కాదు.

భూమిష్ఠ ముద్ధృతాత్పుణ్యం తతః ప్రస్రవణోదకమ్
తతోపి సారసం పుణ్యం తతః పుణ్యం నదీ జలమ్

(పాత్రలో ఉన్న నీటికంటె భూమిపై ఉన్న (నూతి) నీరు పుణ్యమైనది. దానికంటె ఊట కాలువ పుణ్యం. దానికంటె సరస్సు నీరు పుణ్యం. దీనికంటె నది నీరు పుణ్యము. ధర్మసింధువు, ప్రథమ పరిచ్ఛేదము గ్రహణ నిర్ణయః, 30 పుట.)

హరప్పా ప్రజల ప్రధాన ఆహారం బార్లీ, గోధుమలు పిండిదంచి రొట్టె కాల్చుకుతినేవారు (*తరతరాల భారత చరిత్ర - 20 పుట*) లోథాల్‌లో క్రీ.పూ 1800 లో వరి బియ్యం వాడిన నిదర్శనాలున్నాయి. ( పై గ్రంథం 20పుట) యజ్ఞాలలో (బార్లీకి) యవలకు ప్రధాన వినియోగం ఉంది. అపుడు గోధుమలు వరికూడా ఉన్నాయి.

ఆహవనీయాగ్ని చయన ప్రకరణంలో ఓషధులను కూడా అగ్ని చితియందు ఉంచాలి. ఇక్కడ 'సప్తగ్రామ్యా ఓషధయ సప్తారణ్యా', అవి గ్రామాల దగ్గర దున్ని పండించేవి ఏడు, అడవులలో దున్నకుండా పండే ధాన్యాలు ఏడురకాలు మొత్తం పదునాలుగు రకాలు అచట అసాదనం చేయాలి.

'తిల మాషవ్రీహియవాః ప్రియఙ్గ్వణవః గోధూమాశ్చేతి సప్తగ్రామ్యా ఓషధయః' (నువ్వులు, మినుములు, వరి, యవలు, కొఱ్ఱలు, చిఱువడ్లు, గోధుమలు గ్రామాల దగ్గర పండించే 7 ధాన్యాలు. వేణు, శ్యామాక, నీవార, జర్తిల, గురుగులు, గవీధుక, గార్ముతాలు అడవులలో దున్నకుండా పండే ధాన్యాలు.) యవపదానికి బార్లీ అనే అర్థం పి. శంకరనారాయణగారి తెలుగు ఇంగ్లీషు నిఘంటువులోను జి.ఎన్. రెడ్డిగారి తెలుగు నిఘంటువులోను వ్రాశారు. 'యమోషధిం నాధి గచ్ఛేత్తస్యాః స్థానే యవాన్మధు మిశ్రాన్ వపేత్' (వీటిలో ఏ ఓషధయినా లభించక పోతే యవగింజలలో తేనె కలిపి వాటిని దొరకని ధాన్యం స్థానంలో అసాదనం చేయాలి.) అని కల్ప సూత్రం చెబుతోంది. (యజుర్వేదీయ తైత్తిరీయ సంహితా, శ్రీసాయణాచార్య భాష్య సమేతా 4 కాండ, 2ప్ర. 6 అను. భాష్యం 1918 పుట) ఇచట దొరకని ఓషధుల స్థానంలో యవలు వాడాలని చెప్పినందు వల్ల మిగిలిన ఓషధుల కంటె యవలు విరివిగా దొరుకుతాయని స్పష్టపడుతుంది.

వేదపండితులు యవలు వేరు, బార్లీ వేరు అని చెబుతున్నారు. ఆ పక్షంలో గూడా గోధుమలు, వరి వేద సంస్కృతిలోను, హరప్పా సంస్కృతిలోను వాడుకలో ఉన్నాయనడానికి అభ్యంతరం లేదు.

ఒక చిత్రంలో పశువు ఎదుట తొట్టి ఉంది. తొట్టిను వేదం పేర్కొంది (తైత్తిరీయ యజు-4కాం-2ప్ర, 5అను, 5 పనస) హరప్పా ప్రజలలో పెద్దవాళ్ళు జూదం ఆడేవారు. (*తరతరాల భారత చరిత్ర* - 20పు) ఋగ్వేదంలోనే జూదానికి సంబంధించిన సూక్తం ఒకటి ఉంది. (ఋగ్వేదం 10 మం 34 సూక్తం)

లోథాల్‌లో జరిగిన త్రవ్వకాలలో ఓడరేవు బైటపడింది. (*తరతరాల భారత చరిత్ర* - 21 పుట) ఋగ్వేదంలో ఓడల ప్రసంగం ఉంది. (ఋగ్వేదం, 1మం, అధ్యాయం 17, సూక్తం 116, మంత్రాలు 3,4)

ఆ నాగరికతలో వాణిజ్యాలలో కొలతలు, తూనికలు, త్రాసులు, తూకపు రాళ్ళు వినియోగించారు. (*తరతరాల భారత చరిత్ర* - 22పుట) అథర్వణ వేదంలో వణిజ సూక్తం ఉంది. (అథర్వణవేదం, సంహిత 3 కాం, 3అ. 15 సూ.)

హరప్పా నాగరికత సింధునది లోయలో వికసించిన ప్రజలదని చరిత్రకారుల అభిప్రాయం. (*తరతరాల భారత చరిత్ర* - 17 పుట) ఈ సింధు పదం వేదంలో చాలాచోట్ల ఉపయోగించ బడింది.

'సుదేవో అసి వరుణ యస్యతే సప్తసింధవః, అనుక్షరన్తి కాకుదం సూర్మ్యం సుషిరా ఇవ' (ఋ. సం. 6-5-7)

(ఓ వరుణా! నీవు శోభన దేవుడవు, నీ సముద్రమనే తాలువు వైపు ఏడు సింధువులు ప్రవహిస్తున్నాయి.) సింధుపదం నదములను, నదులను, సముద్రాన్ని, దేశాన్ని గూడా చెబుతోంది.

"సముద్రాయ వయునాయ సింధూనాం పతయేనమః, నదీనాం సర్వాసాం పిత్రే జుహుతాం" అనే మంత్రంలో సింధువులు, నదులు గూడా పేర్కొన బడినాయి. కనుక ఇక్కడ సింధు పదం నదములను చెబుతోంది. (తైత్తిరీయ

సంహిత-4 అష్టం. 6ప్ర. 2 అను) హరప్పా నాగరికతలో ఆరాధనా మందిరాలలో హోమగుండాలున్నాయి. (తె. విజ్ఞాన సర్వస్వం 1 సం. చరిత్ర రాజనీతి. 867 పుట.) యజుర్వేదమంతా హోమానికి చెందిన ప్రక్రియలతో ఉంది.

పైన పేర్కొన్న అంశాలు హరప్పా నాగరికతలో వైదిక నాగరికత కలదని వెల్లడిస్తున్నాయి. కనుక "క్రీ.పూ 1500 సంవత్సరాల ప్రాంతంలో భారత దేశంలో ఆర్యులు అడుగుపెట్టారు. ఆ కాలంలోనే ఋగ్వేద రచన సాగింది. ఆర్యులు దేశ ద్రిమ్మరులు. పశు పెంపకం వాళ్ళ బతుకు తెరువు. వాళ్ళకు నగర జీవితమంటే తెలీదు. (తరతరాల భారత చరిత్ర - 23, 24 పుటలు) మొదలయిన చరిత్ర కారుల అభిప్రాయాలు పునః పరిశీలించ దగినవి.



అనే రుద్రాభిషేక ధ్యానంలో పాతాళం నుండి నభస్థలం వరకు బ్రహ్మాండాన్ని ప్రకాశింపజేస్తున్న జ్యోతిస్ఫాటిక శివలింగం వర్ణింపబడింది. శివలింగం చైతన్యానికి ప్రతీక. దానికి ప్రతిబింబం ప్రకృతి అవి రెండు పడుగు పేకల్లా అల్లుకుంటే అదే విశ్వం దానికి ◈ ఈ ముగ్గు ప్రతీక కావచ్చు.

ఒక గుహలో శివలింగం మొదలయినవి కనబడతాయి శివ సహస్ర నామాలలో మహాలింగః (గొప్ప లింగం 77శ్లో ) అగ్నిజ్వాలః (అగ్ని జ్వాల రూపుడు 82 శ్లో) గుహావాసీ (గుహలో నివసించేవాడు 61 శ్లో) అనే నామాలున్నాయి

ఒక ముద్రిక పైన సింహంపై అంబారీ వేసుకుని కూర్చున్న వ్యక్తి చిత్రం ఉంది ఆయన చేతిలో కత్తి మాత్రం ఉంది ఆ సింహం వెనుక ఒక చెట్టు కొమ్మలతో కనబడుతుంది దేవి వాహనం సింహమని ప్రసిద్ధం, ఆమె ఆయుధ ధారిణియై యుద్ధాలు చేసిందని పురాణాలు చెబుతాయి శివ సహస్ర నామావళిలో సింహవాహనః (సింహం వాహనంగా కలవాడు 111శ్లో ) అనే నామముంది. ఒక ప్రతిమలో చెట్లు చిత్రింపబడ్డాయి. శివసహస్ర నామాలలో వృక్షః (వృక్షరూపుడు 110 శ్లో) స్థావరాణాం పతిః (చెట్లకు అధిపతి 152 శ్లో) అనే నామాలున్నాయి.



హరప్పా మొహంజోదారో తవ్వకాలలో దొరికిన ఒక ముద్రను గురించి "బలిని సూచించే సింధు ముద్ర. కింద వరుసలో ఉన్న ఏడు బొమ్మలు బహుశా మొదట బ్రాహ్మణగోత్ర ప్రవర్తకులు కావచ్చు. కిరీటాలను బట్టి వీరిని వన దేవతలనుకోవచ్చు. మూడు కొమ్ముల దేవుడు రావి చెట్టుమీద ఉండడం, ఎనిమిదో పురోహితుడు పూజ చేయడం గమనించవచ్చు. పూజారి వెనుక ఉన్న జంతువు, మేక కొమ్ములు, మేకతల, పొట్టేలు కాయం బహుశా గిట్టల కాళ్ళు ఉన్న కల్పిత మృగం' అని డి.డి. కోశాంబి ఈ చిత్రాన్ని వ్యాఖ్యానించారు. (ప్రాచీన భారతదేశ సంస్కృతి, నాగరికత, చివరి బొమ్మలు 47 చిత్రం) ఇచట కొన్ని ప్రశ్నలు తలెత్తుతాయి.

క్రీ.పూ. 1500 ప్రాంతంలో భారతదేశానికి ఆర్యులు వచ్చారని చరిత్రకారులు చెబుతున్నారు. క్రీ.పూ. 3000 ప్రాంతానికి చెందిన సింధు ముద్రలో బ్రాహ్మణ గోత్ర ప్రవర్తకుల చిత్రాలున్నాయంటే ఆర్యులు క్రీ.పూ. 1500 ప్రాంతంలో రావడం అసంగతమవుతోంది.

వీరు చెప్పిన మూడు కొమ్ముల దేవునికి గుర్రం మొహం, మానవ శరీరం వెనుకకు వ్రేలాడుతున్న జూలు కనబడుతున్నాయి. ఇవి మూడూ కొమ్ములయితే సమాన పరిమాణంలో ఉండాలి. కాని అటూ ఇటూ ఉన్నవి లావుగాను, మధ్యది సన్నంగాను ఉన్నాయి. కనుక వీటిని మూడింటిని కొమ్ములనడం సరిగా లేదు. గుర్రానికి కొమ్ములుండవు. కనుక బహుశా అవి చెవులు కావాలి. గుర్రం శిరస్సుపై మధ్య భాగంలో ఒక సన్నని పుడక నిలబెట్టి కట్టి, దానికి కుచ్చు వేలాడదీయడం గుర్రాల అలంకార విధానం. ఈ గుర్రం మొహానికి ముఖం మధ్య సన్నని దారాలు వ్రేలాడుతూండడం గమనించవచ్చు. కనుక మధ్యది కొమ్ము కాదని అలంకారం కోసం దారాలు వ్రేలాడదీయడానికి అక్కడ ఒక పుడక నిలబెట్టారని చెప్పవలసి ఉంటుంది.

ఆ పశువు ముఖం వేరే కనబడుతోంది. దానిపైనుండే గీతలకు దానికి సంబంధం లేదు. సాధారణంగా చాలా సింధు ముద్రల్లో పై వరుసలో చిత్ర లిపి బొమ్మలు, క్రింద కొన్ని ప్రధానమయిన బొమ్మలు చిత్రించబడి ఉన్నాయి. కనుక పైన గీతంతో దీనికి ముడిపెట్టి మేక బొమ్మలు దేవతలతో కల్పిత వ్యూహంగా ఊహించడం సంగతంగా లేదు.

జాగ్రత్తగా పరిశీలిస్తే ఈ ముద్రికపై బొమ్మలు మనకు చాలా విషయాలు వివరిస్తాయి.

పాతకాలపు బొమ్మల్లో గోవు శరీరం, దానికి స్త్రీ ముఖం కలిగిన చిత్రాలు కనబడతాయి. లలితా సహస్ర నామావళిలో 'గోమాతా గుహజన్మభూః' అని గోమాత అనే నామం ఉంది. (లలితా సహస్ర నామావళి 606 నామం) అంటే అమ్మ దేవికి ప్రతీకగా ఈ పద్ధతిలో చిత్రించేవారన్నమాట. ఈ చిత్రంలో పశువుకు ఆవు గిట్టలుండడం స్పష్టంగా ఉంది.

గుఱ్ఱం తల గల హయగ్రీవుడు విష్ణువు అవతారమని దేవీ భాగవతంలో ఉంది. హయగ్రీవుడు లలితా దేవి నారాధించే వాడని లలితా సహస్రం వల్ల తెలుస్తుంది. తైత్తిరీయారణ్యకంలో ఒక ప్రతీకాత్మక కథ ఉంది. దేవతలు సత్రయాగం చేశారు. దానికి కురుక్షేత్రం వేది. ఖాండవ వనం దక్షిణ భాగం, తూర్ఘ్నం ఉత్తర భాగం, పరీణత్తు వెనుక భాగం, మరు ప్రదేశం ఉత్కరం. దానిలో విష్ణువు యజమానుడిగా యజ్ఞ దీక్షను స్వీకరించారు. దానివల్ల యాగకీర్తి విష్ణువుకు కలిగింది. అందరికీ కలుగ వలసిన కీర్తి విష్ణువుకు ఒక్కడికే లభించిందని దేవతలకసహనం కలిగింది. వారాయన వెంటబడ్డారు.

ఆయన ధనుర్బాణాలతో వారిని నిలువరించారు. తనను వారేమీ చేయలేక పోవడంతో ఆయన నవ్వారు. అపుడాయన తేజస్సుపైకి వచ్చింది. దానిని దేవతలు ప్రవర్గ్యాలనే విధులలో ఉంచారు.

విష్ణువు ధనుస్సు అగ్రాన్ని గడ్డానికి క్రింద కంఠానికి ఆనించి నిలబడ్డారు. దేవతలాయనపై ప్రతీకారం తీర్చుకోవడం కోసం ఉపదీకలనే పురుగులను ఆవారి త్రాటిని కొరుకుమని కోరారు. అవి కొరకడం వల్ల ధనుస్సుపై కొన విష్ణువు శిరస్సును ఎగురుగొట్టింది. ఆ శిరస్సు ద్యావాపృథువులలో చెదరి వ్యాపించింది. విష్ణు శరీరాన్ని దేవతలు మూడు భాగాలుగా చేసి ప్రాతస్సవనం, మాధ్యందిన సవనం, తృతీయ సవనం అని మూడు భాగాల యజ్ఞంగా గ్రహించి యజ్ఞం చేశారు. శిరస్సులేని యజ్ఞంవల్ల వారు స్వర్గానికి చేరలేదు. దేవతలు అశ్వినీ దేవతలను 'యజ్ఞపురుషునికి (విష్ణువుకు) శిరస్సును' అతకమని కోరారు. అశ్వము కలవారు అని అశ్వినీ పదమున కర్థము. అశ్వముఖరూపమయిన నక్షత్రమశ్విని. దానికి వీరు అధిష్ఠాన దేవతలు అని శ్రీకృష్ణయజుస్సంహిత చెబుతోంది. (4కాం. 4ప్ర. 106) వీరు ప్రవర్గ్యాన్ని ఆ యజ్ఞ పురుషునికి అతికారు. అపుడు యజ్ఞపురుషుడు పరిపూర్ణుడయ్యాడు. దేవతల యజ్ఞం సఫలమయ్యింది. (తైత్తిరీయారణ్యకం -5 (ప్ర-1అ) ఈ గాథ శ్రీమద్దేవీ భాగవతంలో కొంచెం మార్పుతో ఉంది.

ఒకప్పుడు విష్ణువు యుద్ధం చేసి అలసిపోయి ధనుస్సు కొనను కంఠమందానుకుని నిద్రిస్తున్నాడు. బ్రహ్మాది దేవతలు యజ్ఞం చేద్దామని వచ్చారు. వమ్రి అనే పురుగుతో విష్ణువును లేపమని కోరారు. అది ధనుస్సు నారి త్రాటిని కొరికింది. ధనుస్సు కొన తగిలి విష్ణువు శిరస్సు ఎగిరి పోయింది. అపుడు దేవతలు బ్రహ్మ ఉపదేశం వల్ల దేవిని స్తుతించారు. దేవి, 'హయగ్రీవుడనే దానవునికి గుఱ్ఱం శిరస్సుకల వానిచేతిలో మరణిస్తాడని వరం ఉంది. వానిని సంహరించడం కోసం విష్ణువుకు గుఱ్ఱం శిరస్సును త్వష్ట ప్రజాపతిచే అతికించు' మని ఉపదేశించింది. అపుడు త్వష్ట అలా చేయడం చేత హయగ్రీవావతారం ఏర్పడింది. (దేవీ భాగవతం. 1స్కం. 5 అ. 112 శ్లో)

ఇతిహాస పురాణాభ్యాం వేదం సముపబృంహయేత్

(ఇతిహాస పురాణాలచే వేదాన్ని వివరించుకోవాలి.) అని పురాణ వచనం. ఈ సింధుముద్రిక పైన తెల్పిన వేద పురాణ కథలను రెండింటినీ సమన్వయిస్తోంది.

సత్రయాగం వనంలో జరిగిందని సూచించడం కోసం అశ్వత్థ వృక్షాలు చిత్రించారు. గుర్రం ముఖం కల పురుషుడు హయగ్రీవుడు. చెట్టుకు ప్రక్కన ఉన్నది బాణాగ్రం. దానికి ప్రక్క కిరీటంతో ఉన్నది విష్ణువు శిరస్సు, దానికి ప్రక్క మేఘ శకలాలు, దానికి ప్రక్క అస్పష్టంగా ఉన్నది ఆహవనీయం, దానిక్రింద గార్హపత్యాగ్ని, దానికి ప్రక్క దక్షిణాగ్ని, అగ్నులను రక్షించే అగ్నీధ్రుడనే ఋత్విక్కు లేదా దాని ప్రక్క ఒక వ్యక్తి ఉన్నారు. ఈయన దేవతలకు ఉపదేశం చేసిన బ్రహ్మ అయి ఉండవచ్చు. ఇది పై వరుస. మధ్య వరుసలో మొక్కకు క్రింద రెండు నిలువు గీతలున్నాయి. ఇది వేదిక ఉత్తరంలో దుమ్ము, గడ్డి వరకలు వేసే చోటు. దానికి ఉత్కరమని పేరు.

ఉత్కరం ప్రక్క ఒక పురుషుడు నిలబడి ఉన్నాడు. ఈయన అధ్వర్యుడు. ఎదుట స్త్రీ ముఖంతో గోశరీరంతో ఉన్నది దేవి.

క్రింది వరుసలో ఏడుగురు వ్యక్తులు నిలబడి ఉన్నారు. 'సప్తహోతార ఋత్విజః' అని శ్రుతి చెబుతోంది. (తైత్తిరీయారణ్యకం 1ప్ర. 7అ-5వ.) హోత, ప్రశాస్త, బ్రాహ్మణాచ్ఛంసి, పోత, నేష్ట, అచ్ఛావాక, అగ్నీధ్ర అనే పేరులతో యజ్ఞంలో ఏడుగురు హోతృగణం ఉంటారు. వీరిలో అగ్నీధ్రుడు పైన ఉన్నాడు కనుక ఈ వరుసలో చివరి వ్యక్తి స్త్రీ. ఈమె యజమాన పత్ని. హోతలు ఋఙ్మంత్రాలతో దేవతలను స్తుతిస్తారు. దేవిని స్తుతించే సందర్భంగనుక, యజ్ఞ సందర్భం గనుక ఈ హోతల చిత్రాలను చిత్రించారు.

ఇలా ఈ చిత్రం తైత్తిరీయారణ్యకంలో, దేవీ భాగవతంలో ఉన్న కథలను సమన్వయం చేస్తూ వేదార్థాన్ని వివరిస్తోంది. అరణ్యక కథ ప్రసక్తంతో కూడిన యజ్ఞం విష్ణు స్వరూపం అని ప్రతీకాత్మకంగా తెలుపుతోంది. 'యజ్ఞో వై విష్ణుః' (యజ్ఞమే విష్ణువు) అని శ్రుతి మరొక చోట చెబుతుంది. ఆ విష్ణువు అవతారమే హయగ్రీవుడని పురాణ కథ చెబుతుంది. ఇలా విష్ణు తత్త్వాన్ని తెలిపే రెండు విషయాలనీ చిత్రం సమన్వయిస్తోంది.

గంగడోలు లేని గోవును గవయ మృగమంటారు. ఈ ముద్రికలలో ఒక దానిలో గవయ మృగం కనబడుతుంది. (A.L. Basham, A Cultural History of India చివర 1 వ కాలింగన్ బొమ్మలలో) 'ఋశ్య ఋషభాయ రాజ్ఞే గవయః' అని గవయ మృగాన్ని వేదం పేర్కొంది. (శ్రీకృష్ణ యజుర్వేద సంహితా -5-5-11) 'గవయః గోసదృశః సాస్నా రహితః' (గంగడోలు లేని గోవు వంటి మృగం గవయం) అని సాయణాచార్యులు వివరించారు.



ఒక ముద్రికలో క్రింద మృగశరీరం పైన స్త్రీ రూపం, మరొక ముద్రికలో క్రింద మృగం, పైన పురుష రూపం ఉన్న ఆకారం చిత్రించబడింది.

(A Cultural History of India చివర 1 వ కాలింగన్ బొమ్మలలో మరియు డి.డి. కోశాంబి, ప్రాచీన భారత దేశ సంస్కృతి, నాగరికత చివరి బొమ్మలు 50వ చిత్రం)

దీనిని పురుష మృగం అంటారు. 'పురుష మృగశ్చంద్రమసే' అని దీనిని వేదం పేర్కొంది. (శ్రీకృష్ణయజుస్సంహిత 5-5-15)

దీనిని శ్రీకోశాంబి మనిషి పులి అని పేర్కొని, విష్ణు నరసింహావతారం నమూనా అని వ్రాశారు. కాని నృసింహావతారానికి సింహ శిరస్సు, నర శరీరం

ఉంటాయి. దీనికి క్రింద సగం మృగ శరీరం, పై భాగం మానవ రూపం ఉన్నాయి. కనుక దీనిని పురుష మృగమనే చెప్పడం సమంజసం. ఇలా హరప్పా సంస్కృతిలో ఉండే బొమ్మలు, చిత్రలిపి, వైదిక సంస్కృతిని, హరి హరారాధనము, ప్రాచీన హిందూ సంస్కృతిని సూచిస్తున్నాయని చెప్పవచ్చు. ఈ చిత్ర లిపిలో మిగిలిన చిహ్నాలను గూడా గుర్తించ గలిగితే మరికొన్ని విశేషాలు గూడా బయటపడతాయి.

ఈ బొమ్మలలో గొడ్డలి, బాణం, కత్తి చిత్రాలున్నాయి కనుక సింధు నాగరికతలో ఇనుము వాడకముందని తేటపడింది. హయ శిరస్సు, ఒంటి కొమ్ము గుఱ్ఱం బొమ్మలున్నాయి కనుక ఈ నాగరికత వారికి గుఱ్ఱం తెలుసని వెల్లడవుతోంది.

ప్రాచీన సంస్కృత గ్రంథాలతో పోల్చి పరిశీలించడం వల్ల సింధు నాగరికత విశేషాలు ఇంకా బయల్పడే అవకాశం ఉంది.



గోమాత

# భారతీయ చిత్రలిపి పఠన విధానం

భారత దేశంలో చిత్రలిపి సింధు ముద్రికలలో కనబడుతుంది. కాని ఆ లిపి తెలిపే విషయం ఇంతవరకు తెలియలేదు. అది తెలియాలంటే భారతీయ శిల్ప తత్త్వం పరిశీలించాలి.

లలితాదేవి ఉపాసనా విధానం చాలా ప్రసిద్ధం. లలితాదేవి చెరకు ధనుస్సు, పాశం, అంకుశం, పుష్పబాణం ధరించి ఉంటుంది. చెరకుగడ గట్టిది కాదు. కనుక ఇది ధనుస్సు నిర్మాణానికి పనికిరాదు. పుష్పాలు సుకుమారాలు. ఇవి బాణం వలె గురిని భేదించలేవు. కనుక నివి వేటికో సంకేతాలు. ఆ విషయం భావనోపనిషత్ వివరిస్తుంది. "శబ్ద స్పర్శ రూప రస గంధాః పంచతన్మాత్రాః పంచ పుష్పబాణాః, మన ఇక్షుధనుః, రాగః పాశః, ద్వేషో ఙ్కుశః

(లలితాదేవి చేతిలో ఉండే అయిదు పుష్పబాణాలు శబ్ద స్పర్శ రూప రస గంధాలనే పంచతన్మాత్రలకు సంకేతాలు, మనస్సుకు చెరకు ధనుస్సు, రాగానికి పాశం, ద్వేషానికి అంకుశం సంకేతాలు. ఉపనిషత్ప్రభాః భావనోపనిషత్, 549 పుట.)

శ్రీమద్భాగవతం విరాట్పురుషుని కౌస్తుభాదికాన్ని ఇలా వివరించింది.

శ్లో. కౌస్తుభ వ్యపదేశేన స్వాత్మజ్యోతిర్బిభర్త్యజః
(విష్ణుదేవుడు కౌస్తుభ మణియను వంకతో స్వాత్మజ్యోతిని ధరిస్తున్నాడు )

శ్లో. స్వాం మాయాం వనమాలాఖ్యాం నానా గుణమయీం దధత్
వాసశ్ఛందోమయం పీతం బ్రహ్మసూత్రం త్రివృత్స్వరమ్

(సత్త్వ రజస్తమో గుణముల స్వరూపమయిన తన మాయను వనమాలగా, వేదముల స్వరూపమును పీతాంబరముగా, ప్రణవమును యజ్ఞోపవీతంగా ధరిస్తున్నాడు)

శ్లో. బిభర్తి సాంఖ్యం యోగఞ్చ దేవో మకర కుండలే
మౌళిం పదం పారమేష్ట్యం సర్వలోక నమస్కృతమ్

(ఈ దేవుడు సాంఖ్యయోగ శాస్త్రములను మకర కుండలములుగాను, సత్యలోకమును కిరీటం గాను ధరిస్తున్నాడు)

శ్లో. అవ్యాకృత మనన్తాఖ్య మాసనం యదధిష్ఠితః
ధర్మ జ్ఞానాదిభిర్యుక్తం సత్త్వం పద్మ మిహోచ్యతే

(నామరూప రహితమయిన ప్రకృతి అనంతుడాయనకు ఆసనం. ధర్మం, జ్ఞానం మొదలయిన వాటితో కూడిన సత్త్వ గుణము పద్మం.)

శ్లో. ఓజస్సహో బలయుతం ముఖ్యం తత్త్వం గదాం దధత్
అపాం తత్త్వం దరవరం తేజస్తత్త్వం సుదర్శనమ్

(ఓజస్సు, సహస్సు, బలముతో కూడిన ముఖ్య ప్రాణ తత్త్వమయిన గదను ధరించుచున్నాడు. శంఖము జలతత్త్వము, సుదర్శన చక్రము తేజస్తత్త్వము.)

శ్లో. నభోనిభం నభస్తత్త్వం అసిం చర్మ తమో మయమ్
కాలరూపం ధనుశ్శార్ఙ్గం తథా కర్మ మయేషుధిమ్

(ఆకాశం వలె నిర్మలమయిన ఆకాశ తత్త్వమును కత్తిగాను, అజ్ఞాన రూపమును డాలుగాను, కాలరూపాన్ని శార్ఙ్గమనే ధనుస్సుగాను, కర్మరూపాన్నే అంబుల పొదిగాను భగవానుడు ధరించాడు.)

శ్లో. ఇంద్రియాణి శరానాహు రాకూతిరస్య స్యందనమ్
తన్మాత్రాణ్యస్యాభి వ్యక్తిః ముద్రయార్థ క్రియాత్మతామ్

(ఇంద్రియములను బాణములుగాను క్రియాశక్తితో కూడిన మనస్సును రథముగాను, పంచతన్మాత్రలే ఆ రథాభి వ్యక్తిగాను చెప్తున్నారు. వరద ముద్రచే వరములివ్వడం, అభయ ముద్రచే అభయమివ్వడం వెల్లడి అవుతాయి.)

శ్లో. భగవాన్ భగ శబ్దార్థ లీలా కమల ముద్వహన్

(భగ శబ్దమునకు సమగ్రమయిన ఐశ్వర్యము, ధర్మము, యశస్సు, లక్ష్మి, జ్ఞానము, వైరాగ్యము అర్థములు. వాటిని తెలుపు లీలా కమలమును స్వామి ధరించాడు.)

శ్లో. ధర్మం యశశ్చ భగవాన్ చామర వ్యజనే భజత్
అత పత్రంతు వైకుంఠం ద్విజాధామాకుతో భయమ్

(భగవంతుడు ధర్మం, కీర్తి వింజామరలుగా, దేనివల్లనూ భయం లేని వైకుంఠాన్ని గొడుగుగా గ్రహించాడు. శ్రీమద్భాగవతం 12 స్కం, 11వ అధ్యాయం, 10 వ శ్లో. నుండి 19 శ్లో. వరకు)

భగవానుడి విరాట్ స్వరూపం కూడా ప్రపంచంలో ఉన్న అనేక వస్తువులకు, దేవతలకు, భావాలకు సంకేతంగా ఏర్పడింది.

శ్లో. ఏతద్వై పౌరుషం రూపం భూః పాదౌ ద్యౌ శ్శిరో నభః
నాభి స్సూర్యో క్షిణీ నాసేవాయుః కర్ణౌదిశః ప్రభోః

(ఈ విరాట్పురుషునికి పాదములు భూమి, శిరస్సు స్వర్గము, బొడ్డు ఆకాశం. సూర్యుడు కన్నులు, ముక్కు వాయువు, చెవులు దిక్కులు. )

శ్లో. ప్రజాపతిః ప్రజనన మపానం మృత్యురీశితుః
తద్బాహవో లోకపాలాః మనశ్చంద్రో భ్రువౌ యమః

(మేఢము ప్రజాపతి, అపానము మృత్యుదేవత. బాహువులు లోకపాలకులు, మనస్సు చంద్రుడు, కనుబొమలు యముడు. )

శ్లో. లజ్జోత్తరో౽ధరో లోభో దంతా జ్యోత్స్నా స్మయో భ్రమః
రోమాణి భూరుహో భూమ్నో మేఘాః పురుష మూర్ధజాః

(పై పెదవి సిగ్గు, క్రింది పెదవి లోభము, దంతములు వెన్నెల, గర్వము భ్రాంతి, రోమములు వృక్షములు, తల వెంట్రుకలు మేఘములు. )

(శ్రీమద్భాగవతం 12 స్కం. 11 అ. 6 నుండి 8 శ్లో.)

ఇక్కడ ప్రపంచంలోని భూమి మొదలయిన వస్తువులకు, బ్రహ్మాది దేవతలకు, సిగ్గు మొదలయిన గుణములకు సంకేతంగా విరాట్పురుషుని శరీరమేర్పడిందని స్పష్టమవుతోంది. కనుక దేవాలయాల్లో ఉండే శిల్పాలు, వాటికి చెందిన అంగోపాంగాలు అన్నీ ఒక్కొక్క దానికి సంకేతంగా ఏర్పడినవని చెప్పవచ్చు. ఏయే దేవతామూర్తి, ఆయన అంగోపాంగాలు వేటికి వేటికి సంకేతాలో వివరంగా పరిశోధించాలి. ఈ పరిశోధనకు భారతీయ శ్రుతి, పురాణేతిహాసాలు తంత్రాగమాలు తోడ్పడుతాయి. ఈ పురాతనారాధన పద్ధతుల స్వరూపం వాటిలో మనకు మిగిలి ఉంది. ఇదే చిత్రలిపి, ఇది హరప్పా మొహంజోదారో కాలం నుండి ఉన్నది. దీని సాధారంగా హరప్పా మొహంజోదారో చిత్రలిపి భావాలను గ్రహించవచ్చు.

శ్రీమద్భాగవతం లోని విరాట్పురుష వర్ణనము పరిశీలిస్తే మధ్యలో ఒక దేవతామూర్తి, చుట్టూ ఆయనకు చేర్పడగిన గుణములకు ప్రతినిధి చిత్రములను చిత్రించే పద్ధతి వ్యక్తమవుతుంది. మొహంజోదారోలో దొరికిన పశుపతి దేవుని ముద్రిక ఇటువంటిదే, ఒక సన్నివేశాన్ని ఒక చిత్రంగా చిత్రించవచ్చు. సింధు లిపి ముద్రిక అని పిలువబడుతున్న ముద్రికలో ఉన్న హయగ్రీవావతార చిత్రం ఇటువంటిది. దీని గాథ తైత్తిరీయారణ్యకంలో లభిస్తోంది.

ఈ రెండు రీతులే కాకుండా ఒకనాటి సంస్కృతికి చెందిన వివిధ చిత్రాలను ఒక ఫలకంపై చిత్రించవచ్చు. అవన్నీ ఆ సంస్కృతి ఇహాముత్ర వికాసాన్ని తెల్పుతాయి. సింధు ముద్రికల్లో ఇలాంటివి కూడా కనబడతాయి. ఈ పద్ధతుల ద్వారా సింధు ముద్రికలలో లిపిని గ్రహించవచ్చు.

భావసామ్యతలో, శ్రీమద్భాగవతంలోను వర్ణనాత్మకంగా, హరప్పా మొహంజోదారో ముద్రికలలో చిత్రాత్మకంగా లభించే ఈ విగ్రహ లిపి మూలాలు కూడా వేదంలోనే లభిస్తాయి.

"తత్ప్రతిష్ఠే త్యుపాసీత, ప్రతిష్ఠావాన్ భవతి, తన్మహ ఇత్యుపాసీత. మహాన్ భవతి. తన్మన ఇత్యుపాసీత. మానవాన్ భవతి" పరబ్రహ్మము ప్రతిష్ఠ (స్థితి హేతువు) అని ఉపాసించాలి. అన్న వస్త్రాది జీవన స్థితి హేతువులను పొందుతాడు. పరబ్రహ్మము మహత్త్వంతో కూడినదని ఉపాసించాలి. ధనాదులతో సమృద్ధుడౌతాడు. పరబ్రహ్మము మనన శక్తితో కూడినదని ఉపాసించాలి. మనన శక్తి గలవాడౌతాడు. (తైత్తిరీయోపనిషత్ 9 ప్ర. 1 అను. 3 పనస)

ఇలా శ్రుతి చాలా చోట్ల కొన్ని గుణాలను పరమాత్మకు చేర్చి ఉపాసిస్తే దానికనుగుణమయిన ఫలాలు కల్గుతాయని చెప్పింది.

ఈ వేద సంప్రదాయాన్ననుసరించే భావనోపనిషత్తులో, శ్రీమద్భాగవతంలో, సంకేత రూపంలో కొన్నింటిని చేర్చి ఉపాసించే సంప్రదాయమేర్పడింది. మొహంజోదారోలో దొరికిన పశుపతి దేవుని ముద్రికలో ఇలా సంకేత రూపంలో కొన్ని లక్షణాలను చేర్చి మహాదేవుని చిత్రించడం జరిగింది.

కనుక చిత్రలిపికి మూలమయిన ఉపాసనల సంప్రదాయం, చిత్రలిపికనుగుణమయిన వర్ణనలు, చిత్రలిపి అనే క్రమంలో చిత్రలిపి భారత దేశంలోనే వికసించినదని స్పష్టమవుతోంది. అయితే పరిణామ క్రమంలో మారిన రూపాలను విశదంగా పరిశీలించి గ్రహించాలి.

చిత్రలిపిలో భాగం, బ్రహ్మను తెలిపేది అయిన ప్రణవలిపి నుండి బ్రాహ్మీ లిపిని ఏర్పరచుకున్నారు. పరబ్రహ్మ నుండి జగత్తు ఏర్పడిందని శ్రుతి స్మృతి పురాణేతిహాసాలు చెబుతాయి. పరబ్రహ్మను తెలిపేది, బ్రహ్మ అనే పేరు గలది అయిన ప్రణవాన్నుండి భాషను అక్షర బద్ధం చేసే లిపి ఏర్పరచుకోడం, దానికి బ్రాహ్మీ అని పేరు పెట్టుకోడం సముచితమే అని స్పష్టం.

# భారతీయ లిపులకు మూలం ప్రణవం

విదేశీయులు వారి ననుసరించిన భారతీయ విద్వాంసులు భారతీయ భాషాలిపులు విదేశ లిపుల నుండి ఏర్పడ్డాయని చెప్పారు. వారి అభిప్రాయాలిలా ఉన్నాయి.

1. లిపికి వేదంలో అధిష్ఠాన దేవత లేదు కనుక గ్రీకులతో సంబంధం వల్ల బ్రాహ్మీ లిపి ఏర్పడింది. మౌర్యుల కాలం నుండి శాసనాలు అధికంగా కనిపిస్తున్నాయి.
2. క్రీ.పూ. వేయి సంవత్సరాల ముందు నుండి భారతదేశానికి విదేశ వ్యాపారం ఉంది. వీరికి ఫినిషియాతో సంబంధం ఎక్కువ. కనుక బ్రాహ్మీలిపి ఫినిషియా లిపి నుండి వచ్చింది.
3. ఆ కాలానికి మధ్యధరా సముద్రం తూర్పు తీరంతో భారతదేశానికి సరాసరి సంబంధం లేదు. కనుక దక్షిణ సెమెటిక్ జాతికి చెందిన సాబా తెగవారి లిపి నుండి బ్రాహ్మీ లిపి పుట్టింది. ఇండియాతో జరిగే పశ్చిమ వ్యాపారమంతా సాబావారి చేతుల్లో ఉండేది.
4. సాబా లిపి శాసనాలు క్రీ.పూ. 2వ శతాబ్దికి ముందువి కనబడవు. బ్రాహ్మీ లిపికి అరేబియా లిపులకు పోలిక కొర్కి. కనుక దక్షిణ సెమెటిక్ నుండి కాక ఉత్తర సెమెటిక్‌కు చెందిన అరమిన్ లిపి నుండి బ్రాహ్మీలిపి పుట్టింది. దీనిని భారతీయులు అభివృద్ధి పరచుకొన్నారు. (మన లిపి పుట్టుపూర్వోత్తరాలు 80, 81, 82 పుటలు)

పై అభిప్రాయాలు సరికావు. సరస్వతీదేవి చేతిలో ఉండే అక్షమాల అకారం మొదలుకొని క్షకారం వరకు ఉండే వర్ణమాల. ఈ వర్ణమాలకు 'మాతృకా సరస్వతి' అనే పేరుతో ఆరాధించడం మంత్రశాస్త్రంలో బాగా ప్రచారం ఉంది. ఏ మంత్రజపం చేసేవారైనా ఈ మాతృకా సరస్వతీ న్యాసాలు మొదట చెయ్యాలి.

అంతర్మాతృక, బహిర్మాతృక అని దీనిలో ప్రధానమైన భేదాలు. ఇవి కాక దీనిలో రకాలున్నాయి. ఇప్పటికీ 'అ-క్ష' మాలతో జపం చేయడం శ్రేష్ఠమనే విశ్వాసం ఉంది.

క్రీ. పూ. మూడవ సహస్రాబ్దికి చెందిన మొహంజోదారో శాసనాల్లో ప్రణవ లిపి ఉంది. ప్రణవం పరబ్రహ్మకు వాచకమని వేదం, యోగశాస్త్రం కూడా తెల్పుతున్నాయి. 'తస్యవాచకః ప్రణవః' అని యోగ సూత్రం. 'ఓమిత్యేకాక్షరం బ్రహ్మ' అని ఓంకారానికి బ్రహ్మ అనే వ్యవహారం వేదంలో ఉంది. ప్రణవం వేదాది స్వరం.

బ్రహ్మకు చెందినది అనే అర్థంలో 'బ్రాహ్మి' అనే పదం వ్యాకరణ శాస్త్రాన్ననుసరించి ఏర్పడుతుంది. ప్రణవ భాగాలకు బ్రాహ్మిలిపికి సంబంధం కనబడుతుంది. ప్రణవ భాగాలకు దేవనాగరలిపికి సంబంధం బాగా కనబడుతుంది. పాత గ్రీకు లిపి నవీన గ్రీకు లిపిగా మారినట్లు బ్రాహ్మిలిపి సంస్కరణాన్ని పొంది దేవనాగరి లిపి అయియుండవచ్చు. అంటే వేదభాష సంస్కృత భాషగా మారినట్లే బ్రాహ్మిలిపి తరువాత దేవనాగరలిపిగా మారి ఉండవచ్చు. ప్రణవంలో. ఓం అని 4 భాగాలున్నాయి. వాటిని వివిధ పద్ధతులతో పేరిస్తే బ్రాహ్మిలిపి, దేవనాగరలిపి ఏర్పడుతున్నాయి.

ఓం అనే దానిలో ఒక భాగానికి వెనుక గీత చేరిస్తే బ్రాహ్మిలిపిలో ( X ) ఏర్పడింది. దీని కొనలను పొట్టకు కలిపి రెండు చతురస్రాలుగా విడదీసి పడుకోబెడితే బకారం (o D) రెండు వృత్తాలుగా మాత్రమే వ్రాస్తే ధకారం (0 D) ఈ సున్నలకు పైన గీతలుగా చేరిస్తే బ్రాహ్మిలో వకారం ( ꀀ ꀁ ) దీనిని తిరుగవేసి తోకను నిలబెడితే జకారం (ᑕ ᒐ) దీనిని రెండు భాగాలు చేసి వరుసన కూర్చోబెడితే బ్రాహ్మిలో హకారం (L L), దీనిలో ఒక భాగాన్ని కలిపి సున్నను చేస్తే థకారం. 3 దీనిని రెండు భాగాలు చేసి వెల్లకిలా కూర్చోబెట్టి మధ్యలో నిలువుగీతలు పెడితే

ఒక రెక్కను వీపుపై గీత చేరింది. प లో ప్రణవం రెక్క వెల్లకితలా ఉంది. ग లో ప్రణవ భాగం బోర్లగిలి ఉంది. ष దీనిలో ప్రణవం రెక్క ముందుకు కొంచెం వంగింది. न దీనిలో ప్రణవంలోని తోక ఉంది. ऋ దీనిలో ముందు ప్రణవం సగముంది. వెనుక ప్రణవం తోక ఒక మెలి తిరిగి ఉంది. ष దీనిలో ప్రణవార్ధం తిరగబడింది. फ దీనికి అదనంగా ప్రణవం తోక కూడ చేరింది. प వర్ణమే ముందొక మెలిక చేర్చుకుంటే ष వర్ణం. పై గీతతో సంబంధం వదులుకుని ముందుకు కొంచెం వంగితే ष వర్ణం ఏర్పడుతున్నాయి. ప్రణవార్ధాన్ని సున్నగా చుట్టితే व వర్ణం, దాని నడుమ గీత గిస్తే ब వర్ణం ఏర్పడుతున్నాయి. प వర్ణానికే పై రెండు కొనలకు గీతను చేరిస్తే म వర్ణమవుతుంది. పవర్ణానికి నడుమ గీతను గిస్తే ष వర్ణమవుతుంది. ప్రణవంలోని తోక పైన చేరే దీర్ఘాలుగా కొన్నింటిలో, వెనుక గీతలుగా కొన్నింటికి చేరింది. ఉదా కీ, ॐ ప్రణవం పైన బిందువు దేవనాగరిలో పైనే చేరుతోంది. ऋ వర్ణంలో మాత్రం ప్రక్క చేరింది.

ఇలా పరిశీలిస్తే ప్రణవ భాగాలయిన త్రిగ అనే వానిని నిలువుగా గాని, తిరుగవేసిగాని, బోర్లవేసిగాని, వెల్లకితలా గాని ఉంచి వాటికి ప్రక్కన పైన గీతలు చేరిస్తే దేవనాగర లిపి ఏర్పడుతోంది. వీటిలో పై గీత తరువాత ఏర్పడింది. వెనుక బ్రాహ్మీ లిపిలో 𑀅 అనే అకారం కనబడుతోంది. ఇలా పరిశీలిస్తే ప్రణవం వల్ల బ్రాహ్మీలిపి, దానిని సంస్కరించడం వల్ల దేవనాగరలిపి ఏర్పడినట్లు గమనించవచ్చు.

# గంగా శబ్దము సంస్కృతీయము కాదా?

గంగానదికి భారతీయ సంస్కృతిలో గొప్ప గౌరవం ఉంది.

ఇమంమే గంగే యమునే సరస్వతి శుతుద్రి స్తోమం సచతా పరుష్ణ్యా

అసిక్న్యా మరుద్వృధే వితస్త యార్జీకీయే శ్రుణుహ్యా సుషోమయా ॥

(ఓ గంగా! యమునా! సరస్వతీ! శుతుద్రీ! పరుష్ణి! అసిక్నితో కూడిన మరుద్వృధా! వితస్త, సుషోమలతో కూడిన ఆర్జీకీయా! మీరు మా స్తోత్రాన్ని స్వీకరించి వినండి!)[1]

అని ఋగ్వేదం కొన్ని మహా నదులను ప్రకటించింది. అందులో గంగ మొదటిది.

అధి బృబుః పణీనాం వర్షిష్ఠే మూర్ధన్నస్థాత్

ఉరుః కక్షో న గాంగ్యః[2]

(వ్యాపార వ్యవహారం చేసేవారిలో బృబు గంగాతీరం ఎత్తుగా ఉన్నట్లు ఉన్నత స్థానంలో ఉంటాడు.)

అని గంగా పదము నుండి పుట్టిన గాంగ్య అను పదాన్ని గూడ ఋగ్వేద షష్ఠ మండలం పేర్కొంది. సంస్కృత భాషా చరిత్రకారులు ప్రాచీనతమ రచనగా పేర్కొన్న షష్ఠ మండలంలోనే గాంగ్య పద ప్రయోగముండటం చేత గంగా పదం ఎంతో ప్రాచీనమని చెప్పక తప్పదు. ఇతిహాస పురాణాలలో గంగా ప్రాశస్త్య మత్యధికంగా ఉంది.

---

1 ఋగ్వేదం - 10 మం. 75 సూ. 5 మం

2 ఋగ్వేదం - 6 మం. 45 సూ. 31 మం.

3 వాల్మీకి శ్రీమద్రామాయణం - బాలకాండ - 43 స.

4 శ్రీమద్దేవీభాగవతం - 9వ స్కంధం - 13 అ. - 121 శ్లో.

5 శ్రీ వేమూరి శ్రీనివాసరావు పూర్వగాథాలహరి - 130 పుట

మహేశ్వరుడు గంగాధరుడు[3]. మహావిష్ణు పాదాల నుండి గంగమ్మ జనించింది[4]. బ్రహ్మ కమండలంతో గంగను ధరిస్తాడు[5]. భగీరథుడు గొప్ప తపస్సుచే గంగను భువికి తీసుకుని వచ్చినాడు[6]. కావున గంగకు భాగీరథి అని పేరు. జహ్నుముని గంగను తన కుమార్తెగా చేసికొన్నాడు[7]. కనుక గంగ జాహ్నవి అయ్యింది. ద్రావిడులకు పరమారాధ్యుడయిన కుమారస్వామి గంగా తనయుడు. కావున గాంగేయుడయ్యాడు[8]. కురువృద్ధుడగు భీష్మాచార్యుడు గంగా పుత్రుడు[9] కాబట్టి ఇతడూ గాంగేయుడే. శ్రీరాముని ధర్మపత్ని సీతాదేవి గంగాదేవిని పూజించింది[10]. దేవీ భాగవతం గంగను దేవత అని గౌరవించింది[11]. స్నానకాలంలో గంగను స్మరించడం[12], భగవత్పూజకుపయోగించే నీటిలో గంగ నావాహనం చేయడం ఆచారం[13]. వివాహంలో మహాసంకల్పంలో గంగా స్మరణముంది[14]. పవిత్రత కొఱకు గంగను చల్లుకొనడం, మరణించిన తరువాత అస్థికలను గంగలో వేయడం ఆచారంలో ఉంది. చాలా యజ్ఞాలు గంగా తీరంలో జరిగినట్లు పురాణేతిహాసములలో కనబడుతుంది. శ్రీశంకరభగవత్పాదులు గంగాజల లవ కణాన్ని త్రాగితే నరకము రాదన్నారు గంగకు ద్వాదశ నామములు, సహస్ర నామావళి ఉన్నాయి. వీటిలో గంగా పదానికే ప్రచార మెక్కువ. భారత దేశంలో

---

6. వాల్మీకి శ్రీమద్రామాయణం - బాలకాండ - 43 స.
7 పై గ్రంథం
8. పై గ్రంథం - 37 స.
9. డా. రామ్‌కుమార్‌రాయ్, మహాభారతకోశ్, చౌఖంబా సాంస్కృత్ సీరీజ్ వారణాసి, (1982) 431 పుట
10. వాల్మీకి. శ్రీమద్రామాయణం, అయోధ్యాకాండ, 52 స. 82 శ్లో. నుండి 91 శ్లో వరకు
11 వ్యాసముని, శ్రీమద్దేవీ భాగవతం, 9 స్కం. 11, 12, 13 అ
12. శ్రీ కనువర్తి మార్కండేయ శర్మ, నిత్య కర్మార్ణవం, వృద్ధప్రకాశిని, మ్యా వల్లకుంట, హైదరాబాద్ (1991) 30 పుట.
13. పై గ్రంథం - 123 పుట
14. యాజ్ఞిక పూర్వ ప్రయోగ చంద్రిక, సావిత్రి ప్రెస్, మదరాసు (1963) 197 పుట.

ప్రాచీన కాలం నుండి వర్ధిల్లిన పెక్కు మతశాఖలతో ఆచారముతో గంగకు మౌలిక సంబంధం ఉంది.

ఈ గంగా పదం ఆస్ట్రిక్ భాషకు చెందినదనీ, దానిని సంస్కృతీకరించుకొన్నారనీ ప్రసిద్ధ భాషావేత్త సునీత్‌కుమార్ చటర్జీ ప్రతిపాదించారు[15]. ఇది పరిశీలించదగిన విషయం.

వారి వాదమిది. "భారతదేశానికి ద్రావిడుల కంటె, ఆర్యుల కంటె పూర్వం ఆస్ట్రిక్ ప్రజలు వచ్చారు. వారుత్తర భారతదేశం, పంజాబున దక్షిణప్రాంతం, మధ్య భారతదేశం, దక్షిణ భారతదేశం కూడా వ్యాపించి యుండేవారు".

వారి పదాన్ని ఆర్యులు 'గంగా' అని సంస్కృతీకరించుకొన్నారు. వారి పదానికి నది అని అర్థం.

ఆస్ట్రిక్ ప్రజలు సీనో టిబెటన్ కుటుంబ భాషలు మాట్లాడే ప్రాంతాల్లో ఉన్నారు. ఆ భాషలలో Kiang పదానికి రూపాంతరాలు వ్యాపించాయి.

ఇండో చైనాలో Khong అను రూపం, మధ్య చైనాయందు, దక్షిణ చైనా యందు Kiang అను రూపం ఉన్నాయి. దీనికి మాండలికంగా Chiang అను రూపముంది దీని నుండి Gang అను రూపమేర్పడి యుంటుంది. అసలు చైనావారుత్తర చైనాలో ఉన్నారు. వారి భాషలో Ho(xo) అనేది ప్రాచీన చైనా భాషలో Gha అని యుంది.

ఈనాడు బెంగాలీ భాషలో 'గంగ' అనే దానికి పెద్దైన నది, నీటి కాలువ అనే మౌలికార్థాలు నిలిచి యున్నాయి. శ్రీలంకలో గంగా పదం నదుల నామాలకు చేర్చి ఉపయోగించబడుతోంది.

---

15. శ్రీ సునీత్ కుమార్ చటర్జీ - Non-Aryan and. Indo-Aryan 38, 39 P

ప్రాచీన చైనీయులు MeKhong riverను Khiang అని వ్యవహరించారు దీని నుండి ధ్వని పరిణామముచే Khong ఏర్పడి యుంటుంది. దీనిని సంస్కృతీకరించుకోవడంచే గంగ ఏర్పడింది.

Khong అనే పదం ఇండో చైనాలో కనబడుతున్నదనీ, ఆస్ట్రిక్ ప్రజలదనీ, సీనో టిబెటన్ దాయి లేక థాయి మరియు ఆస్ట్రిక్ ప్రజలకు చెందినదనీ వారభిప్రాయపడ్డారు.

స్పష్టత కోసం వారు చెప్పిన హేతువులను మళ్ళీ పేర్కొని వాటిలోని అనౌచిత్యాలను వరుసగా గమనిద్దాం.

1. **హేతువు :** నదియనే అర్థం గల Khong అనే ప్రాచీన ఆస్ట్రిక్ పదం ఇండో చైనాలో, దక్షిణ మధ్య చైనాలలోను కనబడుతోంది. ఆస్ట్రిక్ ప్రజలీ ప్రాంతమునకు చెందిన వారు కావచ్చు.

   **విమర్శ :** ప్రాచీన కాలంలో 'గంగా' పదమొక మహానదికి నామమే గాని నదీ సామాన్య వాచకంగా కనబడదు.

2. **హేతువు :** దక్షిణ చైనాలో అనేక నదుల పేరుల చివర Kiang అనే పదం వినబడుతున్నది.

   **విమర్శ :** భారతదేశంలో గంగాపదం అన్ని నదీ నామాలకు చివర చేరడం లేదు. కాని పురాణ గాథలను బట్టి గంగాదేవియే గౌతమీ నదిగా అవతరించిందని తెలియడం చేత ఆ నదీ వాచక నామానికి చివర గంగా పదాన్ని తీర్చారు.

   ఉదా :- గౌతమీ గంగ, దీనికి Kiang వాడుకకు పోలిక లేదు.

3. **హేతువు :** శ్రీలంకలో ఈ నాటికీ గంగా పదాన్ని నదీ వాచకం చివర చేర్చి వాడుతూంటారు.

   **విమర్శ :** ఈ హేతువు సరియయినదిగానే కనిపిస్తుంది. కాని గంగానది

గల ఉత్తర భారతదేశంలో గాని భారతదేశములో గాని ఈ వాడుక పూర్వకాలంలో లేదు. గంగానదీ ప్రాశస్త్యం ప్రచారానికి వచ్చిన తర్వాత తమ సమీపంలో నది గూడ అంత గొప్పదే అనే అభిమానంతో సింహళంలో నదీ నామాలకు చివర గంగా పదాన్ని చేర్చుకొని యుంటారు. ఇది మహాత్మాగాంధీ నామాన్ని పలువురు తమ పేరులకు చివర చేర్చుకోవడం వంటిది.

4. **హేతువు :** Kiang అనుదానికి మాండలికముగా Ghiang = River అనే వాడుక ఉంది. దీని నుండి గంగ ఏర్పడి యుంటుంది.

**విమర్శ :** పరిమిత ప్రాంతంలో వాడుక గలిగిన Ghiang అనే దాని నుండి అత్యంత విస్తృత వ్యాప్తి గలిగిన గంగా పదమేర్పడి నవడం అనుచితం.

5. **హేతువు :** గంగా పదం ఒక ఆస్ట్రిక్ పదానికి సంస్కృతీకరణం.

**విమర్శ :** సహజ పదానికున్న వ్యాప్తి కృతక పదానికుండదు. ఆస్ట్రిక్కుల పదాన్ని 'గంగా' అని సంస్కృతీకరిస్తే ఆ పదానికి భారతదేశంలో ఇంత వ్యాప్తి కలగదు.

6. **హేతువు :** గంగా పదమునకు ఒక నది, నీటికాలువ అనే మౌలికార్థం ఆధునిక బెంగాలీ భాషలో ధ్రువపరచబడింది.

**విమర్శ :** గంగా అనే పదం నదీ విశేష వాచకంగా ఋగ్వేదంలో ప్రసిద్ధిని పొందింది. కనుక ప్రాచీన భారతీయార్య భాషలలో ఎచ్చటైన నదీ సామాన్య వాచకంగా దీనికి వ్యవహారముంటే దానిని ప్రమాణంగా తీసుకోవచ్చును. కాని ఆధునిక భాషలోని వ్యవహారం అర్థ పరిణామంచే ఏర్పడియుండవచ్చు. కనుక ఇది ప్రమాణంకాదు.

7. హేతువు : మధ్య చైనాలో Kiang అను పదముంది. ఇది Sino - Tibetan Dai లేక Thai లకు మరియు ఆస్ట్రిక్ ప్రజలకు చెందింది.

విమర్శ : Kiang అను పదము సీనో టిబెటన్ దాయికి చెందిందా? థాయికి చెందిందా? ఆస్ట్రిక్ ప్రజలకు చెందిందా? అసలు చైనీయులుగా శ్రీ సునీతికుమార్ చటర్జీ గారిచే అంగీకరింపబడిన ఉత్తర చైనావారి భాషలో గూడ ఈ పదానికి రూపాంతరాలుండటం చేత ఇది చైనా భాష పదమని చెప్పవచ్చు. ఒకే పదం రెండు భాషలకు చెందిందని చెప్పడం అనుచితం. Indo-China లో, మధ్య చైనాలో, దక్షిణ చైనాలో, ఉత్తర చైనాలో విభిన్న రూపాలతో ఉన్న ఈ పదము ఆస్ట్రిక్ ప్రజలనుండి అన్ని సీనో టిబెటన్ శాఖలలో వ్యాపించెననడం యుక్తిదూరం.

చైనీయుల పదాన్ని ఆస్ట్రిక్కులు భారత దేశానికి తీసికొనిరాగా అది వ్యాప్తి పొంది సంస్కృత భాషాపదంగా మార్పబడినదని చెప్పడం అనుచితమైన కల్పనం. నిరాధారం

8. హేతువు : Thai Khong = Empetuous, Violent = (సం) ఖర అని అర్థం. Common Khmer ల నది పేరు Tonle - Thom దీని అర్థము. 'Great River' దీనికి సంస్కృతములో మహానది, ఖరనది అని రెండు రకాల అర్థాలు. Annamitic వారు నదిని Song-ton అందురు. దీనికి Great River అని అర్థము.

విమర్శ : భారతదేశంలో గంగకు 'ఖర' అనే వాడుక లేదు. ఏ పెద్దనదినయినా మహానది అని వాడవచ్చు. గంగకున్న ప్రధానమైన పేరులలో

'మహానది' అనే పేరు గూడా లేదు.

ప్రాచీన నిఘంటువయిన అమరకోశం లో గంగ పర్యాయ పదాలలో ఖర పదం గాని ఆ అర్థాన్ని తెలిపే మరియొక పదం గానీ లేదు. దానిలో గంగకు భారతీయ సంస్కృతితో గాఢ సంబంధాన్ని తెలిపే భాగీరథి, జహ్నుతనయ, సుర నిమ్నగ, భీష్మసూః, త్రిపథగా వంటి పర్యాయాలున్నాయి.

ఆస్ట్రిక్ భాషలో ఈ పదముందనడానికి వారాధారం చూపలేదు. ఆస్ట్రిక్ ప్రజ లార్యుల ప్రాబల్యానికి నిలవలేకపోయిన వారు. ద్రావిడులలో, ఆర్యులలో కలిసిపోయిన వారు. వారిప్పటికీ నాగరికతను పొందలేదని ఛటర్జీగారే వెల్లడించారు.

గెలిచిన వారి ప్రభావము ఓడిన వారిపై పడడం ఉంది. నాగరకుల ప్రభావ మనాగరకులపై పడవచ్చు. ఓడిపోయి పారిపోయిన వారు, అనాగరకులు నయిన ఆస్ట్రిక్ ప్రజల పదం ఆర్యుల సంస్కృతిలో ప్రవేశింపదనరాదు. దానికి ఇంత వ్యాప్తి కలిగెననడం మాత్రం యుక్తికి దూరం.

ప్రాచీన చైనీయులు Me-Khong ను Khiang అనడం, దక్షిణ మధ్య చైనాలలో Kiang అను రూపం నదీ సామాన్య వాచకంగా ఉండడం అనే విషయాలను పరిశీలిస్తే అతి పురాతన కాలంలో Me-Khiang అని ఆ River నకు పేరుండేదనీ, అందలి చివరి భాగమే Kiang, Khong అను రూపాలను పొందిందని తోస్తుంది. ఉత్తర చైనాలో Ho అనేది గూడ Khong అనే రూపంలో నడుమ ఉండడం గమనింపదగిన విషయం. ఘోషవంతం, నాదవంతం అయిన Ho అనేది కంఠ్యమయిన K తో కలిసి యున్నపుడు Gha అనీ, విడిగా ఉన్నపుడు Ho అనియు నుండడం ధ్వని పరిణామానికి సముచితమే. అనగానివి యన్ని రూపాలు సీనో టిబెటన్ కుటుంబానికి స్వకీయములే కావాలి.

సంస్కృతంలో గమ్ ధాతువుకు ఉత్పత్తి గలిగితే మొదటి వర్ణం ఆకారముగా

మారుతుంది. కాబట్టి గంగా పదం సంస్కృత భాషకు చెందినదయితే దానిలో గమ్ ధాతువునకు అవృత్తి కలగడం చేత ధాత్వాది వర్ణానికి జకారం వచ్చి 'జంగా' వంటి రూపము కావాలి. అలా కాలేదు. కనుక ఇది సంస్కృత పదం కాదని పూర్వపక్షం.

గమ్ ధాతువునకు 'గన్' ప్రత్యయము చేరడం చేత గంగా పదమేర్పడిందని సిద్ధాంతకౌముది తెలుపుతుంది[16]. కాబట్టి అక్కడి గకారానికి జకారం రాదు. ఈ 'గన్' ప్రత్యయం గంగా పద సాధనం కోసం మాత్రం పుట్టింది కాదు. గమ్ ధాతువునకు గన్ చేరడం చేత 'గంగా' ఏర్పడినది. అద్ ధాతువునకు 'గన్' చేరడంచే 'అద్గః' (పురోడాశము) అనే రూపం సిద్ధించింది[17]. అట్లే 'గన్' నకు కిత్త్వము విధింప బడడంచే గుణము రాకుండా 'పూగః' అను రూపమేర్పడింది[18]. శృఞ్ ధాతువునకు 'నుట్' ఆగమంగా చేరడంచే శృఙ్గః అనే రూపమేర్పడింది[19]. శౄ ధాతువునకు హ్రస్వం కలగటంచే 'శృఙ్గమ్' అను రూపము సిద్ధించినది[20]. వృద్ధిని గూడ అంగీకరించుటచే ఏర్పడిన రూపము 'శార్ఙ్గమ్'[21].

ఇన్ని శబ్దాలలో కనబడే 'గన్' ప్రత్యయాన్ని నిరాకరించటం న్యాయ్యం కాదు.

గంగను హిందువులు పూజిస్తారు. దాని జలమందు పవిత్ర బుద్ధి యుండటంచే పవిత్ర జలములన్నిటినీ గంగా పదముచే పిలవడం తరువాత జరిగి యుంటుంది. ఇది అర్థ విపరిణామం. కావున బెంగాలీ, సిలోన్ మొదలగు భాషలలో నదీ సామాన్య వాచిగా గంగాపదం ప్రయుక్తమవడం తరువాతి కాలంలో జరిగిన పని యనీ, ఆ అర్థం మౌలికార్థం కాదనీ చెప్పవచ్చు. భారతీయ భాషలలో మురికి కాలువను 'గంగ' అని వ్యవహరింపక పోవడం గమనింపదగిన విషయం.

---

16. భట్టోజీ దీక్షితులు, సిద్ధాంత కౌముది, ఉణాదులు 120 పు.
17. భట్టోజీ దీక్షితులు, సిద్ధాంత కౌముది, ఉణాదులు 120 పు.
18. పై గ్రంథం 121 పు
19. పై గ్రంథం 122 పు
20. పై గ్రంథం 123 పు.
21. పై గ్రంథం 124 పు.

ఏ దేశంలో ఏ వస్తువులుంటాయో ఆ దేశంలో తద్వాచక పదములుండటం అవశ్యకం. గంగ భారతదేశంలో హిమాలయంలో పుట్టింది. ఈ దేశంలో ప్రవహించింది. కాబట్టి దానికిచటి భాషలలో పేరుండటం యుక్తి సమ్మతం.

మొదటి నుండీ నదులను, వాని యుత్పత్తి స్థానాలను గుర్తించటం ఆర్యుల కలవాటు[22]. ఆ గుర్తించిన వానికి వారు నామములు నేర్పరచుకొనటం సముచితమే కదా! గంగోత్రి, యమునోత్రి మొదలయిన నదీ జన్మస్థానాలను వారు యాత్రా స్థలాలుగా మన్నించడం ఇక్కడ గమనించదగిన విషయం.

గంగా పదం సంస్కృతంలో మొదటి నుండి ఉంటే తక్కిన ఇండో యూరోపియన్ భాషలలో దీనికి సమాన రూపముండాలి గదా అనే ప్రశ్న తల ఎత్తుతుంది.

ఆర్యులు భారతదేశానికి వచ్చిన తర్వాత గంగానదికీ పేరు పెట్టుకొన్నారని భావించవచ్చు. వారు నగచ్ఛతీతి నగః అని ప్రత్యయాత్మక భాషయయిన సంస్కృతం నుండి నూతన పదాలను కల్పించే అలవాటు గలవారు. కావున ఈ పదము యూరోపియన్ భాషలలో ఉండనక్కరలేదు.

భగీరథుడు తపస్సు చేసి గంగను భూమికి తీసికొని వచ్చెననే గాథను ఇతిహాస విశ్వాసం లేనివారుగూడా జానపద వాఙ్మయ పరిశీలన విధానంతో పరిశీలిస్తే ఒక ఆర్య నాయకుడు మిక్కిలి శ్రమించి మంచుకొండల నడుమ ఉన్న గంగకు దారి నేర్పరచి భూమిపై ప్రవహింప జేసెననే మూలాంశాన్ని గ్రహింపవచ్చు.

హిమ నగాన్నుండి జీవనదిగా ప్రవహించే నదిని 'గమనాత్ గంగా' అనే

---

22 వేదమందలి నదీయుత్పత్తిస్థాన వర్ణనము రచయితము
తైత్తిరీయారణ్యకం - 1 ప్ర. 2 అను - 1, 2 వచనము

వ్యుత్పత్తితో గాని, గంగా యమునా సంగమంలో స్నానం చేయటం ప్రశస్తమ
భావం గల ఆర్యులు 'ఉత్తమాం గతిం' గచ్ఛన్నయతి గంగా' అనే వ్యుత్పత్తితో గా
దీని నేర్పరచుకొనియుంటారు.

ఋగ్వేదంలో గంగా పదం నదీ విశేష వాచకంగా ఉన్నది. అచట గం
యమున, సరస్వతి మున్నగు నదులు పేర్కొనబడ్డాయి. సీనో టిబెటన్ కుటుంబం
'కియాంగ్' మున్నగు రూపాలు నదీ సామాన్యాన్ని తెల్పుతున్నాయి. కనుక
రెండూ భిన్నాలనీ, ఋగ్వేదంలోనే ఉండటం వల్ల 'గంగాపదం' సంస్కృతావి
స్వకీయమే అనీ చెప్పాలి. ఋగ్వేదంలోని 6వ మండలంలోనే గంగా పదానికి
పదమయిన 'గాంగ్య' అనేది ప్రయోగింప బడటం చేత గంగా పదం మిక్కి
ప్రాచీనమని చెప్పక తప్పదు.



వృషభము, యజ్ఞపాత్రల ... ముద్రిక

